కొడవటిగంటి
కుటుంబరావు

# దేవుడిచ్చిన వరం

నవభారత్ ప్రచురణ

# ఇందు

# దేవుడిచ్చిన వరం

వెనుకటి కొక సద్బ్రాహ్మణుండేవాడు. ఆయన నిత్య సత్యవ్రతుడు. పరమదయాళువు. ఆకాశం విరిగి మీద పడ్డా అబద్ధం ఆయన నోటవచ్చేదికాదు. చిన్న దోమకు కూడా ఆయన ఎన్నడూ హాని తలపెట్టి ఎరగడు. అయితే దుర్భర దారిద్ర్యం ఆయన జీవితాన్ని కుంగదీసింది. బ్రతుకు ఆయనకు నరకప్రాయమయింది. తన దారిద్ర్యం తనకేకాక సాటివారికికూడా బాధాకరంగా ఉన్నసంగతి గ్రహించినవాడై, తనను భగవంతుడే తప్ప సాటి మానవులెవరూ ఉద్ధరించలేరని గ్రహించి భగవంతుణ్ణి గురించి ఘోరతపస్సు ప్రారంభించాడు.

ఆ బ్రాహ్మడి సత్యాహింసలకు అదివరకే సంతోషించిన భగవంతుడు ఆయన ఘోరతపస్సుకు మెచ్చినవాడై ప్రత్యక్షమై "ఏం కావాలో కోరుకో" అన్నాడు. భగవంతుడికి కాపాటి తెలియక కాదు. భగవంతుడు బ్రాహ్మడికోరిక తీర్చాలా, వద్దా అనే సమస్యపై కైవల్యంలో హోరాహోరి చర్చలు జరిగాయి. చర్చల అనంతరం వోటింగు

జరుగగా బ్రాహ్మడికి అనుకూలంగా ఏడుగురు లోకాల ప్రతినిధులూ, ప్రతికూలంగా అయిదుగురు లోకాల ప్రతినిధులూ వోటు చేశారు. రెండులోకాల ప్రతినిధులు చర్చలోగాని వోటింగులోగాని పాల్గొనక తటస్థంగా ఉండిపోయారు... అయినా బ్రాహ్మడినోటనే పలికిద్దామని భగవంతుడు "నీకేం కావాలో కోరుకో!" అన్నాడు. అదీకాక కైవల్య రాజ్యాంగ పరిషత్తువారు కృతయుగంలో ఏర్పాటు చేసిన కాన్స్టిట్యూషను ప్రకారం భగవంతుడు ఆవిధంగా అడగవలసిన బాధ్యత కూడా లేకపోలేదు. (ఈ కథా కాలంనాటికి ఇంకా కొత్త కాన్స్టిట్యూషను కైవల్యంలో అమలులోకి రాలేదు. అది వేరే కథ. మరోసారి చెబుతాను.)

బ్రాహ్మడు భగవంతుడిమీద ఒక చిన్న దండకం, చదివి "స్వామీ, నాకు వెయ్యికోట్ల వరహాలు దయచేయించు" అన్నాడు.

అంతడబ్బుతో ఆ బ్రాహ్మడు సుఖపడడని భగవంతుడికి తెలుసు కాని ఆ సంగతి బ్రాహ్మడితో చెప్పటానికి భగవంతుడికి హక్కు లేదు అందుచేత బ్రాహ్మడడిగిన వరం కాస్తా ఇచ్చేసి భగవంతుడు తనదారిన తాను అంతర్ధానమైనాడు.

ప్రపంచంలో ఉన్న దరిద్రమంతా తానే మోస్తూ ఉండినట్టూ ఆ భారమంతా ఒక్కసారి దిగిపోయినట్టూ అయి బ్రాహ్మడు ఏకాయెకి ఇంటికొచ్చిపడ్డాడు. బ్రాహ్మడు

ఇంటికి రావటమేమిటి, నట్టింట్లో అటకవిరిగి కిందపడట మేమిటి, రెండూ ఒకేసారి జరిగాయి.

"అయ్యో ఎంత అపశకునం" అని బ్రాహ్మడి పెళ్ళాం కంటతడి పెట్టింది.

"ఓసి నీయిల్లు వరహాలుగాను, ఊరుకోవే," అంటూ బ్రాహ్మడు అటక విరిగిపడిన కారణం అన్వేషించే సరికి సంచులు దొరికాయి. పెద్ద పెద్ద గోతాలు! సీళ్లువేసిన గోతాలు! వాటినిండా - బ్రాహ్మడు వెంటనే ఊహించాడు వరహాలు! ఒక్కొక్క గోతంలోను లక్షేసి వరహాలు!

"మనపంట పండిందే! మన దరిద్రం తీరిందే! ఇదు గోనే అంతులేని ధనం! వరహాలు ఒంటినిండా పోసుకోవే! గుప్పెడు తీసుకుని కాసులకు గిరవాటెయ్యవే!" అని బ్రాహ్మడు వొళ్లుతెలీకుండా పేలసాగాడు.

"ఎందుకండీ ఇన్ని వరహాలూ ? బరువుచేటూ! నిక్షేపంలాటి అటక కాస్త విరిగి పడిపోయిందికదా -అయిదు ఊరగాయ జాడీలు పెట్టినా కదలని అటక" అన్నది బ్రాహ్మడి పెళ్ళాం.

తన భార్యకు ఈ డబ్బు విలవ ఇంకా తలకెక్కలేదని బ్రాహ్మడు గ్రహించి, "ఓసి అదేంమాట! చూడవే మన దగ్గర వెయ్యికోట్ల వరహాలు ఉంది. ఇంతడబ్బు రాజుగారి దగ్గర ఉందటే? దీంతో నీయిష్టంవచ్చినంత భవంతులు నీ యిష్టంవచ్చినన్ని కట్టించవచ్చు అప్పటికి ఈ బస్తాలలో

ఒకసారైనా తరగదు తెలిసిందా? అందుకోసం ఏడవకు" అన్నాడు.

"ఎందుకన్ని ఇళ్ళూ, చక్కని గుడిసె ఉండగా? మనకు భవంతు లెందుకండీ?" అన్నది బ్రాహ్మడి భార్య.

ఆవిడకు చెప్పి లాభంలేదనుకున్నాడు బ్రాహ్మడు. ఆయన ఇళ్ళమీద ఇళ్ళూ, గ్రామాలమీద గ్రామాలు కొనసాగాడు. రోజూ సంతర్పణలు చేయసాగాడు.

బ్రాహ్మడి ధనరాసులమాట చుట్టుప్రక్కల పాకిపోయింది. ఒకరోజు ఎక్కడినుంచో బందిపోటు దొంగలు వచ్చి బ్రాహ్మడి ఇంట్లోపడి పదిహేను వరహాల మూటలు మోసుకుపోయినారు. బ్రాహ్మడు వారిని వారించబోయినాడు. కాని వాళ్ళుకత్తిదూసి బ్రాహ్మడి చేతిమీద గాటు పెట్టి, "బుద్ధికలిగి ఉండకపోతే మెడమీద యింకా పెద్ద గాటు పెడతా" మన్నారు.

ఒక నెలగడిచిందో లేదో ఊళ్ళో పెద్దసభ చేశారు. సభకు బ్రాహ్మణ్ణి కూడా పిలిచారు. ఆ సభలో బ్రాహ్మణ్ణి గ్రామ పెద్దలంతా తీవ్రంగా ఖండించారు. బ్రాహ్మడు ఆశ్చర్యంతో నోరుతెరచి వినసాగాడు.

ఒక పెద్ద మాట్లాడాడు, మిగిలినవారు-బ్రాహ్మడితో సహా - నిశ్శబ్దంగా ఆలకించారు.

"మన ఊరికొక గొప్పపీడ - ఒకగొప్ప విపత్తు ఒక, ఒక గొప్ప అనర్థం దాపురించింది. అదేమిటంటే మన

శివయ్య కుబేరుడైనాడు. శివయ్య అంటే మనకందరికీ యిష్టం. మనం శివయ్యకూ శివయ్య కుటుంబానికీ, సదా ఎల్లప్పుడూ మనకు చాతనయిన సహాయం చేస్తూ వచ్చాం. అటువంటి శివయ్య మనకు కృతజ్ఞుడై ఉండకపోగా మన జీవితాలు దుఃఖభాజనం చేయడానికి భగవంతుని గురించి తపస్సుచేసి మానవమాత్రుడు కలలోకూడా కని వినని ధన రాసులు సంపాదించాడు.

"పోనీ ధనరాసులు సంపాదించుకున్న శివయ్య వాటిని నిక్షిప్తం చేసుకున్నాడా అంటే అదీలేదు. ఆ ధన రాసులను జాతి కులమత వయో వివక్షతలులేకుండా వెద జల్లేస్తున్నాడు. ఈ ఒక్క గ్రామంలోనే శివయ్య రాజాధి రాజులుండవలసిన భవంతులు కట్టించాడు. ఈ చుట్టుప్రక్కల నూరు గ్రామాలలో ఇటుకగాని, పెంకుగానికి సున్నంగాని మందులోకి లేకుండా పోయాయి. అథవా దొరికినా పదింతలూ, నూరింతలూ ధర చెబుతున్నారు. ఎందుకుచెప్పరూ? శివయ్య ఇంకా నూరిళ్ళకు సామాగ్రి మాట్లాడివుంచాడు. శివయ్య ఏధరైనా ఇవ్వగలడు. చెప్పండి, ఈ పరిసితులలో మనబోటి గృహస్థులం ఎట్లా బతికాలి?"

"శివయ్య రోజూ సంతర్పణలు చేస్తున్నాడు చుట్టు ప్రక్క నూరు గ్రామాలలో ఎక్కడా ధాన్యంగింజలేదు. అథవా ఉంటే శివయ్యతో పోటీచేసి మనం కొనలేం—"

శివయ్య ఈ అభిశంసన భరించలేకపోయినాడు. లేచి సభవారికి నమస్కారంచేసి "నేను చేసిన అపచారం

ఏదన్నా ఉంటే నన్ను మీరంతా మన్నించాలి. మీఅందరికీ ఇళ్ళు కట్టిపెడుతున్నాను. మీకు వేరే ఇళ్లెందుకు? వాటిలో నేను నివసించగలనా? మీరే నివసించండి. భగవంతుడిచ్చినది ఇంత ఉంది కనక నేను నిత్యమూ మీకు భోజనము పెడతాను. మీరు వేరే పొయ్యిరాజెయ్యక నేను పెట్టే భోజనం ఆరగించండి. ధాన్యం ఎంత ఖరీదైనా కొనటానికి నేనున్నానుగా?" అన్నాడు.

ఈమాటకు మరో పెద్దమనిషి నిప్పులు కక్కుతూ లేచి, "నూరు ఇళ్ళలో నూరు గ్రామాలవారిని ఎట్లా నివాసం పెడతావు? నీకేమైనా బుద్ధి ఉందా లేదా? అదీకాక అందులో బలంగలవాళ్ళూ, హంతకులూ దౌర్జన్యం చేయగలవాళ్ళూ అదివరకే చేరారు. వందలమందికి భవంతులు కల్పించి వేలమందికి ఇటుక, రాయి, సున్నంబెడ్డా దొరకకుండా చేశావు. నీ సంతర్పణలు అఘోరించినట్టే ఉన్నాయి. రోజూ నీ పంచభక్ష్య పరమాన్నాలు తిన్నవాళ్ళు అజీర్తి చేసి వాంతులు కలిగి చస్తున్నారు. అదొక లెక్కలోది కాదు. ఈ విధంగా ఈ నూరు గ్రామాలవారూ రోజూ తినడానికి ఈదేశంలో తిండెక్కడుంది? మహా పెడితే ఆరునెల్లు పెడతావు ఆతరవాత ఒక్కగింజ మిగలదు. నీ పది హాలు పొలంలో చల్లి ధాన్యం పండించవలసిందే! ఈ ఆరు నెల్లూ అయాక నీకు నీ పెళ్ళానికీ, పిల్లలకూ మెతుకుండదు. నీతోపాటు పలువేలు ప్రజలు తిండికి మాడిచస్తారు. ఏదో మమ్మల్ని ఉద్ధరిస్తున్నవాడల్లే చెప్పొచ్చావు!" అని అరిచాడు.

ఆయన ఇంకా పూర్తిచెయ్యక పూర్వమే మరొక పెద్దమనిషి లేచి ఈవిధంగా అన్నాడు:

"శేషయ్య ఆరునెల్లనూట చెబుతున్నాడు. ఇవాళ మాటేమిటి? శివయ్య పుణ్యమా అంటూ వర్ణాశ్రమ ధర్మాలు అప్పుడే అడుగంటాయి. మంగళ్ళు పలకటం లేదు. చాకళ్ళు పలకటం లేదు. వ్యవసాయకులుకూడా ఈపడు పొలాలమీద శ్రద్ధ చూపటం లేదు. ఎందుకు చూపుతారు? వారికి రోజూ శుష్టుగా తిండిదొరుకుతున్నది. ఎవరుమాత్రం ఎందుకు పని చేయాలి? ఏ గింజలకోసం వాళ్లు ఇదివరలో పనిచేస్తూ వచ్చారో అవి వారికి పది-తలుగా లభిస్తున్నాయి కద! వర్ణాశ్రమ ధర్మాలు అడుగంటినాక ఈ సమాజానికి వినాశనం తప్పదు. ఇక్కడ చేరినవారు గడ్డాలు గీకించుకొని ఎన్నాళ్ళయింది? నామాట నమ్మండి మనకు విలయం ఆసన్నమయింది."

శివయ్య మళ్ళీ సభకు చేతులు జోడించి, "మీరు చెప్పేటువంటి మాటలు వింటూంటే నాకు భయంగా ఉన్నది. కనుక నాకు భగవంతుడిచ్చినది యీనస్తూ ప్రజలందరికీ ఈ క్షణమే పంచేస్తాను. అప్పుడు నేనుకూడా అందరితోనూ సమానుణ్ని అవుతాను. ఎవరికీ దరిద్రం వుండదు" అన్నాడు.

సభలో కొందరు సంతోషపడి హర్షధ్వానాలు చేశారు. కాని, "వల్లకాదు! ఎంతమాత్రమూ వల్లకాదు" అంటూ ఒక గడ్డంమనిషి లేచి నిలబడ్డాడు. మళ్ళీ సభ నిశ్శబ్దమయింది.

"శివయ్య దగ్గర ధనరాసు లుండడం కంటె కూడా నిలయహేతు వేదన్నావుంటే అది అందరి ఆర్థిక దరిద్రమూ తీరడమే! ఏమంటారా? వివిధవృత్తులు చేసుకొనేవారు దరిద్రంలో వుండబట్టే సంఘం నడుస్తోంది. చాకళ్లూ, మంగళ్లూ సాలీలూ, కుమ్మరులూ, కమసాలులూ, కమ్మరులూ, వడ్రంగులూ, మొదలైన వృత్తులవారు బ్రాహ్మలు మొదలైన వారితో సమానం అయితే సంఘానికి కావలసిన సంపద ఎవరు సృష్టిస్తారు? సంపదను సృష్టించేవారి దారిద్ర్యం మీదనే సంఘ జీవితమంతా ఆధారపడి ఉండగా ఆ దారిద్రాన్ని తొలగించడంకన్నా సంఘానికి విపత్కరం మరొకటి ఉండదు. యిదేమంత దుర్గ్రాహ్యమైన విషయంకాదు" అన్నాడు.

ఇంతలోనే ఇంకొక గడ్డమాయన లేచి, "అదీకాక అందరిదగ్గిరా సమంగా ఉన్నడబ్బు మృత్తికతో సమానం. అది దారిద్ర్యాన్ని తొలగించదు. వస్తువుల ధరలుమాత్రం ఒకటికి నూరింతలు పెరుగుతవి అంతే! ఆర్థిక శాస్త్రవేత్తను కనక చెప్పానుగాని సంఘంగతి ఏమైనా చింతలేదు" అన్నాడు

"మరి నన్నేం చెయ్యమన్నారు? అన్నాడు శివయ్య దీనంగా.

నువు నీ ధనరాసులు బ్రాహ్మణ్యానికి మాత్రమే పంచు. వారు సంపద సృష్టించరు కనకనూ, వారిడబ్బు కాలక్రమాన సంపద సృష్టించే వారికి చెందుతుంది" అన్నాడు మొదటి గడ్డంవాడు.

"ఒక బ్రాహ్మణ్యానికే కాక పనిపాటలు లేనివారికి, సంస్కృతినే పెంపొందించే వారికి, వ్యాపారం చేసేవారికి, ధనికులకూ కూడా ఈడబ్బు పంచవచ్చు. అందువల్ల సంఘ వినాశనం జరగదు అని అర్థ శాస్త్రం ఘోషిస్తుంది. ఇందులో నా స్వంతం ఏమీ లేదు" అన్నాడు రెండో గడ్డం వాడు.

ఆనాటి అర్థరాత్రి ఎవరో శివయ్య వాకిలి మెల్లగా తట్టారు. ఆర్భాటాలు, హాహాకారాలు, పెడబొబ్బలూ, దివిటీల వెలుగూ స్ఫురించని కారణాన చేత శివయ్య బాదిపోటు దొంగలని భయపడక తలుపు తెరిచాడు తలుపు తెరవగానే ఆయన విస్మయం ఏమని చెప్పాలి. రెండు మూడు వందల మంది బలశాలులు విచ్చుకత్తులతోనూ, గండ్రగొడ్డళ్ళతోనూ, పలుగులతోనూ, దుడ్డుకర్రలతోనూ, బరిశెలతోనూ, ఆవరణలో ప్రవేశించారు. శివయ్య ప్రాణాలు నిలువునా పోయినంతపని అయింది. అయితే ఆయన భయపడ్డట్టు ఆయనమీద తమ ఆయుధాలు ప్రయోగించక, అందరూ వంగి ఆయనకు నమస్కారం పెట్టి "దణ్ణాలు దొరా!" అన్నారు.

"ఏం కావాలి ? ఎందుకొచ్చారీ అర్థరాత్రి ?" అన్నాడు శివయ్య.

వాళ్ళలో ఒకడు ముందుకువచ్చి దొరవారు దేవేంద్రులు. మేం ఏలినవారి బానిసలం. ఈ బ్రాహ్మలంతా చేరి

తమ సొంతంతా కాజెయ్యా చూస్తున్నారు. తమ సంపద చూడలేక కళ్ళలో నిప్పులు పోసుకుంటున్నారు. తమరు ధర్మదాతలు గనక, అడగనివాడికి పాపంగా, డబ్బు పారేస్తున్నారు. కాని ఈపని ఎవరూ చేయరు. తమ దగ్గర డబ్బుంటే సంఘానికి ముప్పన్నది వొట్టి అబద్ధం. రాజుగారి బొక్క-సం నిండా డబ్బున్నది. రాజుగారు చల్లగా ఏలబట్టే ప్రజలు బ్రతుకుతున్నారు మీరైనా ఆపనే చేస్తేమంచిది. మిమ్మల్ని కాపాడటానికి మేమున్నాం. మీరేది చెబితే అది చేస్తాం. మీరు ధర్మం ఎరిగినవారు ధర్మాన్ని నిలబెట్టి అధర్మాన్ని పోగొట్టండి అశిష్టంగాని అధర్మాన్ని ప్రోత్సహించకండి. మీరు తపస్సు ధారపోసినడబ్బు అందరికి పంచటం అధర్మం. మీరు రాజుకన్నకూడా బాగా దుష్టశిక్షణా శిష్టరక్షణా చేయండి. మేం ఆశాపాతులంకాం. మాసేవనుబట్టి మీరు ఈనాము లిప్పించండి!" అన్నారు.

బ్రాహ్మడికి ఈమాటలు నచ్చాయి. ఈ బలగం సహాయంతో ధర్మ పరిపాలన సాగించటానికి బ్రాహ్మడు నిశ్చయించినాడు.

మర్నాడు గ్రామపెద్దలు శివయ్యా దగ్గరికి వచ్చారు. శివయ్యా తనడబ్బు తనదగ్గరే ఉంటున్నదని, దానిని ఎవరికి పంచబోవటం లేదని చెప్పాడు.

"నిన్న సభలో చేసిన ప్రసంగాలన్నీ ఏమయాయి!" అన్నాడు ఆర్థికవేత్త కోపంగా.

"అవి వ్యర్థంకా లేదు. నేను సంతర్పణాలూ అవి

మానేస్తున్నాను. నాడబ్బు అనవసరంగా ఎవరికీ చిల్లిపగాణీ ఇవ్వను. దాన్ని కోరేవారు నేను చెప్పినట్టు సంఘానికి సేవ చేయాలి." అన్నాడు శివయ్య.

"అట్లా అయితే తమ ధనరాసులవల్ల సంఘానికి కించి త్తయినా అపాయంలేదు అని ఆర్థిక శాస్త్రం ఎలుగెత్తి చెబుతోంది. ఇందులో నా స్వంతం ఏమీలేదు." అన్నాడు గడ్డంవాడు.

"నువ్వు నాకు ఆర్థిక మంత్రిగా ఉంటావా!" అన్నాడు శివయ్య.

"దానికి ఆర్థిక శాస్త్రం ఏమీ అభ్యంతరం చెప్పదు. ఆర్థిక శాస్త్రరీత్యా ఆర్థిక మంత్రికి నెలకు రెండు వేల వరహాల వేతనమూ ఇతర వ్యాపారాది సౌకర్యాలూ చూపవలసి ఉంటుంది."

మిగిలిన పెద్దలు కోపంతో వెళ్ళిపోయి చెట్టుకింద సభ చేశారు. వారిలో రెండు పక్షాలయాయి.

"శివయ్యచేత ధర్మపరిపాలన సాగింతాం, మన బ్రాహ్మణ్యానికి ఏమీలోపం ఉండదు." అన్నారు ఒకపక్షం.

"మనని ఏ క్షత్రియుడుగాని, అధమం దాశీపుత్రుడు గాని ఏలితే ఒప్పుకుంటాంగాని ఈ శివయ్యా మనని ఏలే వాడు!" అని పృచ్ఛించారు రెండో పక్షం.

మొదటి పక్షంవారు నేరుగా శివయ్య దగ్గరకి తిరిగి వచ్చి రకరకాల మంత్రిపదవులు స్వీకరించారు.

రెండో పక్షం వారు కొందరు నాయకులను ఎన్నుకున్నారు. ఆ నాయకులు నేరుగా నూరామడ దూరంలో ఉన్న రాజు దగ్గిరికి వెళ్ళి "అయ్యా, మహాప్రభో! మా ప్రాంతంలో మరొక ప్రభుత్వం, అధర్మ ప్రభుత్వం-సాగింది. తమరు తమ సైన్యాలతో వచ్చి మా రాజ్యంమీద యుద్ధం చేసి చోరులూ, హంతకులూ అండగా పెట్టుకుని పరిపాలన సాగించే మా అధర్మ ప్రభువును నాశనం చేసి ధర్మప్రభువులు ధర్మచ్యుతి కాకుండా చూడాలి!" అన్నారు.

"కులాలకు జై" "వర్ణాశ్రమ ధర్మాలు" "వర్ధిల్లాలి!" అని మిన్నుముట్టేటట్టు నినాదాలు చేశారు.

రాజుగారి దగ్గరకూడా హంతకులూ చోరులూ ఉన్నారు. వాళ్ళతో రాజుగారికి పనివుంది. అయితే ఈమాట ఈ పంచమాంగదళ నాయకులకు చెప్పటం దేనికి? రాజుగారు చెప్పలేదు.

రాజుగారు రాయబారులకు నగలూ నాణ్యాలూ, ఇచ్చి, భోజనం పెట్టించి, తన దాసీలను వారి పరిచర్యకు నియోగించి యుద్ధానంతరం వారికి స్థానికపరిపాలనోద్యోగాలు వాగ్దానం చేసి, యుద్ధానికి ఆయత్తం అయినాడు.

మరో ఆరునెల్లకు ఈయుద్ధం జరిగింది. యుద్ధంలో రాజుగారు చిత్తుగా పడిపోయినాడు. ఆయన బలాలు శివయ్య బలాలకు వెన్నిచ్చి వాయువేగ మనోవేగాలతో పలాయనం చేశాయి. పంచమాంగదళ నాయకులు పదిమంది పట్టుపడ్డారు. వారికి యుద్ధనేర విచారణ స్థానంవారు ఉరిశిక్ష విధించారు. విచారణ శివయ్య అధ్యక్షతకిందే జరిగింది.

శిక్షలు ఆయనే స్వయంగా చెప్పాడు. మర్నాడు యుద్ధ నేరస్థుల శిరచ్ఛేదం జరిగింది.

ఇది జరిగిన రాత్రే శివయ్య తన మంత్రివర్గంతో మేడమీద రహస్య సభలు జరిపి "ఈయుద్ధం అసలు ఎందుకు జరపవలసి వచ్చింది?" అన్నాడు.

"మన ప్రతిపక్షంవారు మనకు బ్రాహ్మణ కులాభిమానం లేదని భయపడి శత్రుపక్షంలో చేరారు. నిజానికి బ్రాహ్మణేతరులు మనమీద అభిమానంతో యుద్ధంచేసి ప్రాణాలు అర్పించబట్టే మనం విజయం పొందాం" అన్నాడొక మంత్రి.

అంతవరకు బాగానేవుంది. కాని చీటికి మాటికి ఇటువంటి యుద్ధాలు వస్తే మనంభరించలేం! మన వైఖరి మారాలి. అగ్రవర్ణంవారి సానుభూతితో మనం ఇకముందు పరిపాలన సాగించాలి" అన్నాడు శివయ్య.

"అట్లా చేసినట్టయితే ఈ జరిగిన యుద్ధానికి నీతి వుండదు" అన్నాడొక మంత్రి.

"చరిత్ర కెప్పుడూ నీతిలేదు. ఏలినవారి ఇష్టప్రకారం చేయవచ్చు. తిరుగుబాటుకోర్లు అగ్రవర్ణంలో ఉండగా మనం ఇతర వర్గాలవారి అభిమానం దేవులాడి లాభంలేదు. ఇవాళ సాయంకాలం ఉరితీయబడ్డ యుద్ధనేరస్థులు చేసిన సాహసం ఇతర వర్గాలవారు కలలో కూడా తలపెట్టివుండరు. వారి మంచితనాన్ని మనం సద్వినియోగ పరచుకోవాలి. అదీగాక పదిమంది బ్రాహ్మలు ఉరితీయబడ్డారనే కోపం

కార్చిచ్చులాగ బ్రాహ్మణ వర్గంలో వ్యాపిస్తోంది. మనం జాగ్రత్తపడాలి.”

శివయ్య కొత్తపాలసీని గురించి రహస్యప్రణాళిక తయారుచేయించి అమలుజరిపాడు. కాని యీ విషయం ఇతరవర్గాలవారికి క్రమంగా తెలిసింది. ఏ బ్రాహ్మణ యుద్ధానికి దారితీశారో వారికిప్పుడు పరిపాలనలో మంచి సౌకర్యాలు కలగటమూ, రక్తంధారపోసి విజయం సాధించిన మిగతా కులాలవారి జీవితం నానాటికి క్షీణిస్తూ జీవితం దుర్భరం అవుతూండటమూ ప్రజలకు తెలిసిరాసాగింది.

ఈ ఉద్యమం మొదట కులతత్వంమీదనే సాగింది.

“కులతత్వాలు నాశనం చేయటానికి దేశం ఘోరమైన యుద్ధానికి గురిఅయి ఎంతో నష్టకష్టాలకు లోనయింది. అందుచేత యీ ప్రభుత్వం ఎటువంటి కులతత్వాలు సహించదు. కులతత్వవాదులు నిర్దాక్షిణ్యంగా శిక్షించబడతారు” అని శివయ్య ప్రకటన చేశాడు యీ ప్రకటనకు అగ్రవర్ణాలవారు బహుసంతోషించారు. తక్కువ కులాలవారిలో చాలామంది మోసపోయినారు.

కాని సన్నగా ఆరంభమైన ప్రభుత్వంమీద తిరుగుబాటు చీలికలై, కొత్తకొత్త దారులవెంట అభివృద్ధి సాగింది. ఈ తిరుగుబాటుదార్ల ముఠాలన్నిటిలోకి అతి ప్రమాదకరంగా పరిణమించినది నాస్తికులముఠా

చిత్రమేమిటంటే ఈ నాస్తికులముఠా ప్రభుత్వంలాగే కులతత్వాలను నిరసించింది. ఈ ముఠాలో బ్రాహ్మల దగ్గిర్నించి పంచములదాకా చేరి ఏ కుల విభేదాలు లేకుండా

పనిచేయసాగారు. వీరు కోరినదల్లా దేశసంపదను అన్ని కులాలకూ న్యాయంగా పంచాలని, కులాలమధ్య దోపిడి జరగరాదని, సంపదను సృష్టించని వారికి సంపదమీద ఏ హక్కు భుక్తాలూ ఉండరాదని.

ఈ ముఠాకు నానాటికీ ప్రజలలో - ముఖ్యంగా హీన జాతులలో - ప్రాబల్యం హెచ్చటంచూస్తే శివయ్యకు విస్మయం కలిగింది. ఈ ముఠానాయకులను ఎందరినో తల తీయించాడు. మరెందరినో యావజ్జీవ కారాగారంలో ఉంచాడు. వీరిమీద ఏ ఆరోపణలూ లేకపోతే లేని ఆరోపణలుకూడా చేయించాడు. కాని నాస్తికుల ఉద్యమం ఆగ లేదు.

నాస్తికముఠా నాయకులు వీధులు కలిసేచోట నిల బడి, "చరిత్ర చదవండి. ఇవాళ మనను అణచటానికి చూస్తున్న ఈ శివయ్య ఒకనాడు తనడబ్బంతా ప్రజలందరికీ సమంగా పంచుతానన్న వాడే! మనం డబ్బు సమంగా పంచమనటం లేదు; న్యాయంగా మాత్రమే పంచమంటున్నాం. వస్తువులు ఉత్పత్తిచేసేవారికి డబ్బుపంచితే ఉత్పత్తి ఎవరుచేస్తారని పెద్దలడిగిన ప్రశ్నకు శివయ్య సమాధానం చెప్పలేకపోయినాడు. ఆ సమాధానం మేం చెబుతున్నాం! సంఘానికి ఇతరత్రా సేవచేయలేని ప్రతివాడూ వస్తువులు ఉత్పత్తి చేయవలసిందే, యీ సంఘంలో వస్తువులు ఉత్పత్తిచేయించటం ఒక లాభసాటి వృత్తి అయిపోయింది. ఆవృత్తిచేసే వారు తరతరాలు కాలుమీద కాలేసుకుని పనీపాటా చేయకుండా జీవిస్తూ తమ బొక్కసాలు

నింపుకుంటూ, పెంచుకుంటున్నారు. వస్తువులు ఉత్పత్తి చేసేవారు నానాటికి దరిద్రంవాత పడుతున్నారు. ఇట్లా ఎందుకు జరుగుతున్నదో శివయ్యే మనకు చెప్పాలి. ఒకప్పుడు వ్యవసాయం చేసేవారికింద ఉండినభూమి రానురాను పొలాలముఖం ఎరగనివాళ్ళ హక్కు భుక్తంలోకి ఎందుకు పోతున్నదో, ఒకప్పుడు రైతులుగా ఉన్నవారంతా రాను రాను రైతుకూలీలుగా ఎందుకు మారిపోతున్నారో కూడ శివయ్యే మనకు చెప్పాలి" అని ఉపన్యాసాలు దంచ సాగారు.

నాస్తికుల్ని ఎదిరించటానికి రహస్య ముఠాలు ఏర్పడ్డాయి. వీళ్ళు అర్ధరాత్రివేళ వచ్చి రైతుల ఇళ్ళూ, కార్మికుల ఇళ్ళూ, నాస్తికముఠా సభ్యులఇళ్ళూ తగలబెట్టి ఘోరహత్యాకాండ సాగించారు. ఈ రహస్యకూటాలమీద శివయ్య యుద్ధం ప్రకటించాడుగాని క్రియకు ఈ యుద్ధం కాగితంమీదే జరిగింది. తనపై ఒత్తిడి హెచ్చుతున్నకొద్ది నాస్తికులు తీవ్రచర్యలు సాగించారు. వారు తీవ్రచర్యలు సాగించినకొద్ది వారిపై శివయ్య మరింత తీవ్రచర్యలు అమలు జరిపాడు.

జీవితం దుర్భరమైపోయింది. ప్రజ అల్లాడి పోసాగారు.

"నాస్తికులను చిత్రవధ చెయ్యనందుకు ప్రజలకిదే శిక్ష. ఈ అరాచక పరిస్థితులకు ప్రభుత్వం బాధ్యతే ఏమీ లేదు. తమ నిజమైన శత్రువులెవరో ప్రజలు తెలుసుకోవాలి. ప్రభుత్వం ఏదన్నా సహిస్తుందిగాని నాస్తికులను సహించదు" అని శివయ్య ప్రకటించాడు.

ఈ ప్రకటన ఏమీ ఫలించలేదు.

ఒక సుముహూర్తం చూసి శివయ్య తన శత్రువైన రాజుదగ్గిరికి ఒకచారుణ్ణి పంపాడు. నాస్తికత్వాన్ని అణచడానికి సమైక్య ప్రయత్నాలు సాగించడానికి ప్రణాళిక తయారయింది. వేలిముద్రలు కూడా మరో నెలలోగా పడిపోతాయి.

శివయ్య పెద్ద ప్రకటన తయారు చేశాడు. అందులో నాస్తికులకు కాలం మూడిందనీ, వారి నిర్మూలనానికి అంతర్జాతీయ సన్నాహాలు ఆరంభమయ్యాయనీ ప్రకటించాడు.

ఈ ప్రకటన జరిగిన మర్నాడే శత్రురాజుల బలాలు వచ్చి శివయ్య రాజ్యాన్ని శాంతియుతంగా ఆక్రమించారు. వారు ప్రజలను కొల్లగొట్టి కనపడ్డ స్త్రీలను చెరచసాగారు.

ఇంతకాలానికి శివయ్య రాజ్యంలో ధర్మం నాలుగు కాళ్ళా నడవసాగింది.



# నిజమైన అపచారం

కనకమ్మ చచ్చింది. చచ్చి స్వర్గానికెళ్ళింది. స్వర్గంలో ఒకవిధమైన సోవియట్ ప్రభుత్వం ఉంటుందని చెప్పొచ్చు. మిగిలిన దేశాల్లో ఏయే వర్గాలు అనాథలుగా ఉంటాయో, వాళ్ళ నియంతృత్వం సోవియట్ ప్రభుత్వంలో అమలుజరిగినట్టే భూలోకంలో అన్నిరకాల యితిబాధలకు లోనై, ఒక్క క్షణంకూడా సుఖమన్నది ఎరగని ప్రాణులకు అక్కడే ఉత్తమస్థానం లభిస్తుంది. ఇది అందరూ అనుకునే మాట

అయితే స్వర్గంలోకూడా కొన్ని మడతపేచీలున్నై. కొత్తగా వచ్చిన ప్రాణులందర్నీ స్వర్గం పొలిమేరలబయట కాంపుల్లో ఉంచుతారు. కాలక్రమాన వాళ్ళ కేసులు విచారణజరిగి వాళ్ళ మంచిచెడ్డలనుబట్టి స్వర్గంలో ఉచిత స్థానాలలో నివాసాలు నియమితకాలాలకు ఏర్పాటుచెయ్యటం అవుతుంది.

కనకమ్మ నడివయస్సయినా రాకుండానే చచ్చి

పోవటంచేత కనీసం ఒకనెల గడిచేదాకా ఆవిడ కేసు విచారణకు వచ్చే అవకాశంలేదు స్వర్గంలో ఒకరోజు భూలోకంలో ఒకసంవత్సరం. కనకమ్మ కేసు విచారణకు అవసరమైన సాక్షులను భూమిమీదో రుణంతీరటానికి కనీసం ఒక స్వర్గవాసం అవసరం.

తనపేరు అప్పుడే అనేక పత్రికలలో పడిందనీ, తన కేసు విచారణకు వచ్చేసరికి స్వర్గవాసులంతా విడ్డూరంగా చూడవస్తారనీ కనకమ్మ ఎరగనే ఎరగదు. భూలోకంలో ఆవిడను ఎవరూ గమనించలేదు. ఆవిణ్ణి మొగుడు గుంజను కట్టి ఎర్రిపులుపులతో రోజూ తాగివచ్చి బాదితే కనకమ్మ పెట్టిన కేకలు విన్నవాళ్ళు విన్నట్టే వుండిపోయినారు. దాన్ని గురించి ఏమిచెయ్యాలసి ఎవరికీతట్టలేదు. ఆవిడ ఆకలికి వళ్ళు తరబడి అల్లాడిపోతే "ఈకనకమ్మ ఏంతింటున్నది? ఎట్లాబతుకుతున్నది?" అని ఆరాతీసినవాళ్ళు లేరు. ఆవిడ చివరకు మంచానపడి బాధతో రెండునెల్లు తీసుకుంటే ఆ విషయం కూడా ఎవరూ పట్టించుకొన్నట్లు కనపడలేదు. బతికిఉండగా బయటి పంచను ఆవిణ్ణి తలదాచుకోనిచ్చిన పెద్దమనిషికూడా చస్తుందని తోచగానే ప్రాణంతోనే వీధిలోకి ఈడ్పించేశాడు.

కనకమ్మను మొగుడు పెట్టిన కష్టాలను గురించి చోద్యంగా చెప్పుకున్న అమ్మలక్కలు, కబుర్లమానేసిన మరుక్షణం బేషరతుగా తమ మొగుళ్ళపక్కలు చేరేవాళ్ళు. నాలుగురోజులనుంచి ఆవిడకు తిండిలేదని వార్త తెలిసినాక

"పాపం!" అని విరక్తిగా చప్పరించేసి మరుక్షణం భోజనాలకి కూర్చుని షడ్రసోపేతంగా మూడుపూటలకి సరిపడా తిన్న అమ్మలక్కలున్నారు. తీరా కనకమ్మ చచ్చినాక ఆవిడ శవాన్ని దహనం చెయ్యటానికి ఇరవైరూపాయలు ఇట్టేపోగుచేసిన ధర్మాత్ములు ఆవిడ జీవించి వుండగా ఆవిడ అవసరాలకు గాను ఎన్నడూ వసూలుచెయ్యలేదు. ఒకప్పుడు కనకమ్మలో కొంత అభిమానమూ, ఆత్మవిశ్వాసమూ, ఆశా ఉండి ఉండవచ్చును. కాని, చచ్చేసమయానికి ఆమెలో గర్వించే లక్షణాలేవీ లేవు. ముప్ఫయ్యెదేళ్ళ జీవితంలో ఆమె తనకుండదగిన హక్కులూ, స్వాతంత్ర్యమూ, జ్ఞానమూ, జీవశక్తీ అన్నీ పోగొట్టుకున్నది. ఈ బ్రహ్మాండంలో తనకు ఎక్కడా స్థానంలేదని ఆమెనమ్మింది. ఒకదోమకున్నపాటి అర్హతకూడా తనకు లేదనే నమ్మకం తెచ్చిపెట్టుకున్నది. తనను ప్రపంచం విడిచేసి పూర్తుకోవటం ఆవిడకు సహజంగానే కనిపించసాగింది. మగవాడైపుడితే తనబతుకు ఇంకొంచెం బాగుండేదేమోనని ఒకప్పుడు అనుకున్నది. గాని, రానురాను అది గొంతెమ్మకోరికగా కనపడసాగింది. జీవితమూ, ప్రకృతీ, భగవంతుడూ కట్టుకట్టి తనను ఒక్కసారిగా కాకుండా ఒక్కొక్కఅణువే నిర్మూలిస్తున్నారని ఆమెకి తోచింది. "నేను ఎంత గొప్పదాన్ని కాకపోతే నామీద సృష్టియావ ఇట్లా ఎదురుతిరుగుతుంది!" అని మాటుకు ఆవిడకి తట్టలేదు.

తీరా చచ్చినాక, స్వర్గంవచ్చినాక, తనకు ముందుగా చచ్చిన పిల్లలిద్దరూ మళ్ళీ తనకు కనిపించేసరికి ఆ ఆనందం

భరించలేక కనకమ్మ అపరిమితంగా బాధపడింది. ఆనందం అంతబాధ కలిగిస్తుందని ఆవిడకి అంతకుపూర్వం తెలీదు. ఎట్లా తెలుస్తుంది? ఆవిడకు జీవితంలో ఏ ఆనందమూ లేదు. అట్లా ఎవరన్నా వుంటారా? వుండరు. అందుకనే స్వర్గంలోని పత్రికలు ఆవిడను గురించి అంతా విడ్డూరంగా రాయటం జరిగింది. ఇంత విపరీతమైనకేసు ఎన్నడూ విచారణకు వచ్చి ఉండలేదు.

## 2

కనకమ్మకి స్వర్గంమీద మంచిఅభిప్రాయంఏర్పడింది. ఈస్వర్గంవాళ్ళు వాళ్ళ తల్లులకడుపుచల్లగా, తనపిల్లల్ని తనకు తిరిగి ఇప్పించారే. ఇక్కడ తనను ఒకమనిషల్లే చూస్తున్నారే. ఇంత ఉపకారం ఎవరు చేస్తారు? ఎందుకు చేస్తారు?

"ఏవమ్మోవ్! ఇప్పుడింకేంచూశావ్? త్వరలో నీ విచారణ జరుగుతుంది. ఆ తరవాత నీకు స్వర్గంలో ఫోర్ట్ ఏరియాలో అన్నిటికన్నా ఎత్తయిన భవంతిలో మూంచ పడకగదుల ఫ్లాట్ ఇస్తారు. ఎయిర్ కండిషనింగూ, ఎలక్ట్రిక్ కిచెన్, లిఫ్టూ అన్నిటితోసహా?" అన్నాడొకబ్బాయి. అతను ప్రెస్ రిపోర్టరని కనకమ్మకు తెలియదు.

"ఎందుకు నాయనా? ఇక్కడ స్వర్గంమల్లేనే వుంది.

మనిషి కింతకంటే ఏంకావాలి? నాజన్మకి?" అన్నది కనకమ్మ.

ఆ అబ్బాయి నవ్వి. "ఎబ్బే. ఇది స్వర్గమేకాదు. నువ్విప్పుడు స్వర్గం పొలిమేరలోనే లేవింకా!" అని వెళ్ళిపోయినాడు.

ఆవిడ వచ్చిన వారం రోజులకి ఆవిడ పేరడుగుతూ ఒక పెద్దమనిషి వచ్చాడు. ఆయనకి బట్టతలా, కళ్ళజోడూనూ, చేతిలో కాగితాలు పట్టుకున్నాడు. చిత్రంగా ఆ కాగితాల్లో ఆవిడ జన్మ వృత్తాంతమంతా నాడీగ్రంథం చదివినట్టు చదివేశాడు. మొదట ఆమెకు ఆశ్చర్యం వేసింది. తరవాత బాధకలిగింది. మరచిపోవలసిన విషయాలన్నీ ఆయన తవ్వటం రుచించలేదు.

"జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు నా కష్టాలన్నీ గట్టెక్కాయి. ఆగోడవంతా ఇప్పుడెందుకు? అన్నది కనకమ్మ.

వచ్చిన పెద్దమనిషి కళ్ళజోడుమీదిగా ఆవిణ్ణిచూచి, "ఇదంతా జరిగిపోయినదాన్ని గురించికాదు. జరగవలసిన దాన్ని గురించే" అన్నాడు. జరగబోయే విచారణ గురించి ఆ పెద్దమనిషి చెప్పేవరకూ ఆమెకేగోడూ తెలియదు.

"విచారణ దేనికి నాయనా?"

"నీకు ఎందరో అత్యాచారాలు చేశారు. కనకనే నువ్వన్ని బాధలుపడటం జరిగింది. లీగల్ స్టాండ్ పాయింటు

నుంచీ నీది చాలా విచిత్రమైన కేసు నీవైపున ఒక్కతప్పూ లేదు. ఈ కేసులో ఉన్న నేరమంతా మిగిలినవాళ్ళమీదే వుంది ఐడియల్ కేస్!"

"గ్రహచారం చాలకపోతే ఎవరికైనా కష్టాలు తప్పవు" అన్నది కనకమ్మ, ఏమనటానికి తోచక.

"అదే పొరపాటు. గ్రహాలలో మాకు నమ్మకంలేదు. ఉంటే ఈ స్వర్గమే వుండదు. పుణ్యాపాపాలన్నీ మనిషివే అనే ఉద్దేశంతో స్వర్గనరకాలు ఏర్పడ్డాయి" అన్నాడు ప్లీడరుగారు.

ఆయన రెండురోజులకొకసారీ మూడురోజులకొకసారీ వచ్చి తనదగ్గరవున్న రికార్డు ఒక్కొక్కటే ఆవిడకి వినిపించి ఆవిడ సంతకాలు చేయించుకుపోసాగాడు. ఆవిడకిదంతా ఏమీ బాగాలేదు. పోయినకొద్దీ ఆమెకిదంతా మరింత రోత కాసాగింది. ఈరికార్డు ఎంతవిన్నా తరగటంలేదు. అందులో తనకు ఎరిగున్న ప్రతిప్రాణీకూడా ముద్దాయే. ప్లీడరుగారు ఈ ముద్దాయిలతోకూడా మాట్లాడివస్తున్నట్టుఆమెకర్థమైంది.

"వాళ్ళంతా ఎక్కడున్నారు?" అన్నదామె.

"ఎక్కడుంటారు?" అన్నాడాయన నవ్వి.

"నాకేం తెలుసునాయనా? అందులో చాలామందిని చూసి చాలాకాలమయింది. చూసొద్దామని. వాళ్ళెక్కడున్నట్టు తెలిసి చూడటానికి పోకపోతే బాగుంటుందా?" అన్నదామె.

"ఒక్కొక్కప్పుడు జోనెక్కి నేను చదివే రికార్డు ఆమోదించి, దానిమీద నీ సంతకాలకింద వాళ్ళుకూడా సంతకాలు చేసేటప్పుడు చూద్దువుగానిలే అన్నాడు ప్లీడరు.

"అమ్మో, ఈకోర్టులంటే నాకు తగనిభయం. మా నాన్న వీటి మూలంగానే నిక్షేపమంటిపొలం పదెకరాలు ఎందునాకాకుండా చేసుకున్నాడు" అన్నదావిడ.

"ఇది అటువంటి కోర్టుకాదు" అని ప్లీడరు వెళ్ళిపోయాడు.

## 3

ఎట్లాగయితేనేం కనకమ్మ కేసు విచారణకు వచ్చింది మూడువందల మంది ముద్దాయిలూ, ఇరవై వేలమంది సాక్షులూ విచారింపబడ్డారు. విచారణలో మొదటిభాగంలో ఉన్న రికార్డులు కోర్టులో చదవటం, వాటిని ముద్దాయిలూ, సాక్షులూ ఆమోదించినాక వారి సంతకాలు తీసుకోనటం. రెండో భాగ మేమిటంటే ముద్దాయిల సంజాయిషీ.

మొదటిభాగమంతా పత్రికలద్వారా అదినరకే స్వర్గవాసులు తెలుసుకుని ఉన్నారు. ముద్దాయిలను గురించి విచారణకు ముందుగా పత్రికల్లో ప్రచురణ జరగటం స్వర్గములో సబ్ జూడిస్ కాదు. అక్కడి లా వొప్పుతుంది.

అయినా ప్లీడరుగారు మూడునాలుగు స్వర్గమాసాలు ఈ రికార్డు పఠనంతోనే సరిపుచ్చాడు.

స్వర్గవాసులు యీ విచారణ చూడటానికి తండోప తండాలుగా వచ్చారు. రహస్యమేమిటంటే స్వర్గంలో పరిస్థితులేమీ బాగాలేవు. రాజకీయాందోళన జాస్తీగావుంది. ప్రజలదృష్టిని రాజకీయాల మీదనుంచి మరల్చటానికి పత్రికలు ఈ కేసుగురించి మరింతగా రాసినై. విచారణకూడా సాధ్యమైనంతగా పొడిగించవలసిందిగా జడ్జిగారికి ప్రభుత్వం ఉత్తరువు చేసినట్టు ఒకవదంతు పొక్కింది.

హైకోర్టువరండాలో ఇద్దరు ప్లీడర్లు నిలబడి "ఎగ్జిక్యూటివుకు జూడిషియరీ ఇంతలోకువైతే ఇంకేం డెమోక్రసీ!" అని అనుకున్నారు.

ఎట్లాగైతే యేం, రికార్డు చదవటం పూర్తయింది. చదివినరికార్డు మీద కనకమ్మ సంతకంకిందిగా మూడు వందలమంది ముద్దాయిలూ మారు మాటాడకుండా సంతకాలు పెట్టారు. జరిగిన విషయాలను గురించి ఎవరూ కాదనలేరు. తాము అట్లా యెందుకు ప్రవర్తించారో, అందుకుగాను తమను ఎందుకు శిక్షించకూడదో ముద్దాయిలు చెప్పుకోవలసివుంది.

ఈ విచారణ ఆరంభం కాకముందు న్యాయాధికారి కనకమ్మకేసి తిరిగి "అమ్మా ఈ మూడువందలమంది నీకు

రకరకాల అత్యాచారాలు చేశారు. ఇందులో నీమీద మీ అత్తగారికి నేరాలు చెప్పినవాళ్ళున్నారు. నీమీద లేని రంకులుకట్టి నిన్ను నీ మొగుడిచేత కొట్టించినవాళ్ళున్నారు. నీభర్తను నీకు కాకుండా చేసి తమ వలలో వేసుకున్న ఆడవాళ్లున్నారు. నీదగ్గరవున్న కాస్తడబ్బు పుచ్చుకొని నీకు పనికిరాని నీళ్ళు, మందని ఇచ్చినవాళ్ళున్నారు. వీరంతా నిను ఏవిధంగా బాధకలిగించారో నువ్వు ఈకోర్టుకు చెప్పుకుంటే నువ్వు చెప్పినదానిప్రకారం నీకు నష్టపరిహారంకింద సరిపోయే స్థానం స్వర్గంలో దొరుకుతుంది” అని హెచ్చరించాడు.

“ఎందుకునాయనా! నాకెవ్వరూ ఏమీబాధ కలిగించలేదు. నామీద మా అత్తగారికి పడదు కనకనే వాళ్ళూ వీళ్ళూ చాడీలుచెప్పారు నాభర్త నమ్మేడుగనకనే నామీద రంకులు కట్టారు. నేనక్కర్లేకపోయినాక నా మొగుడు ఎవరిదగ్గిరికిపోతే ఏముంది, పాపం! ఆ వైద్యులు ఎంతడబ్బు చిక్కులువుండి నావంటి పేదముండ డబ్బుకాశించారో! నేను బాధపడే గీతవుండి బాధపడ్డాను” అన్నది కనకమ్మ.

జడ్జీగారూ, ప్లీడరుగారూకూడా ఒకళ్ళమొహం ఒకరు చూసుకున్నారు.

“ఇదుగో, చూడమ్మా, నువు వీళ్ళందరినీ సమర్థిస్తే వాళ్ళకు శిక్ష తగ్గుతుందనుకోకు వాళ్ళకుపడేశిక్ష వాళ్ళకు పడుతుంది. నీ జీవితం ఎవరిమూలంగా, ఎందుమూలంగా కష్టాలపాలయిందో కోర్టుకు చెబితే, దానికి అనుగుణంగా

నష్టపరిహారం జరుగుతుంది. అవమానంవల్లనా? నిందవల్లనా? హింసవల్లనా? మోసంవల్లనా? నిరాదరంవల్లనా? దేనివల్ల నీజీవితం అధికంగా దుఃఖభాజనమయింది? దానికి కారకు లెవరు?

ఎవరిని మీరెట్లా శిక్షించినా నాకభ్యంతరం లేదు నాయనా! నా జీవితంలో—మిగిలినవాటి మాటేమిటిగాని. నావొంటిన రెండువందలరూపాయల నగలుండేవి; నాభర్త క్షయతో తీసుకుంటూ వైద్యానికని ఆ నగలన్నీ అమ్మి ఖర్చుపెట్టి రోగం నయంకాకుండానే పోయినాడు. ఆయన ఆపని చెయ్యకుండావుంటే, నేనూ, నాపిల్లలూ అంతత్వరగా ఆకలికి మాడి చచ్చిఉండం. ఆమాటొక్కటే నన్ను చచ్చే వరకూ వేధించింది. నాపిల్లలు నాకళ్ళయెదుట ఆకలికిమాడి చస్తుంటే ఎన్నిసార్లు నామొగుణ్ణి తిట్టుకున్నాను. ఎన్ని రాత్రులు ఆ నగలుగురించి ఆలోచిస్తూ నిద్రపట్టక మేలుకున్నానో! నా మొగుడు ఒక్క నెలముందు చచ్చివుంటే, నా పిల్లలిద్దరూ ఇంకో రెండుసంవత్సరాలు ఆలస్యంగా చచ్చేవాళ్ళు! ఏమో, అప్పటికి వాళ్ళకి కాస్త రెక్కలొచ్చి ఏ మూటలయినా మోసి అట్లా బతికేవాళ్ళేమో! అది తలచుకుంటేనే నాగుండె అవిసిపోతుంది" అన్నది కనకమ్మ.

ఇసకవేస్తేరాలని ఆ కోర్టులో ఆవిడ అన్నదానికి అందరూ నిశ్చేష్టులై అతి నిశ్శబ్దంగా వుండిపోయినారు.

# హింస

మా కుటుంబాలలో పిల్లల్ని పెంచటానికి రెండే పద్ధతులు, పిల్లల్ని చావగొట్టి చెవులుమూసి చెప్పినమాట వినేటట్టు చేయటమూ, లేకపోతే వాళ్ళని గారాబం చేసి వాళ్ళు ఆడినట్టు ఆడటమూ ఒకటి సన్మార్గమూ, రెండోది దుర్మార్గమూను. కొందరికి రెండూ దుర్మార్గాలే అనిపించ వచ్చు. అది వేరే విషయం. మరో పద్ధతిలో పిల్లల్ని పెంచ టం సాధ్యమని మేం మటుకు ఒప్పుకోం. ఎక్కడైనా, ఎవ రైనా పరాయివాళ్ళ పిల్లలు మా పిల్లల్లా కాకుండా తల్లి దండ్రుల ప్రేమకు పాత్రులవుతూ కూడా, తల్లిదండ్రులు చెప్పే మాటలను విశ్వసిస్తూ వాళ్ళు వద్దన్న పనులు మాన టం మా అనుభవంలోకి వస్తే అది ఆ తల్లిదండ్రుల పురా కృత పుణ్యమంటారు ! "పుణ్యం కొద్దీ పురుషుడు, దానం కొద్దీ పిల్లలు" అనుకుంటాం. మాకటువంటి పిల్లలు పుట్టక మాకు పుట్టేవాళ్ళు చూస్తూ చూస్తూ మా మాట వినరు. మేం పూర్వజన్మలో చేసిన పాపం అటువంటిది ! అంచేత మేం వాళ్ళని క్రమశిక్షణలో పెంచుతాం. వాళ్ళ బాగు

కోసమే వాళ్ళని కొడతాం. మేం కొట్టకుండానే వాళ్ళు భయభక్తులు కలిగివుంటే ఇక కావలసిందేమిటి? కాని అంత అదృష్టం మాకు రాసిపెట్టివుంటేగా? పిల్లల్ని క్రమశిక్షణలో ఉంచలేకపోతే వాళ్ళని పాడుచేస్తాం. ఆపేక్ష అని పేరుపెట్టి వాళ్ళను పడేసి నాకుతాం. అది మా దౌర్బల్యం. అందు కనే అట్లా పెరిగిన పిల్లలు మాట వినరు. మాకు ఎదురు తిరుగుతారు. చిన్నతనంలో పిల్లల్ని హద్దులో ఉంచలేక పోయినందుకు వాళ్ళు పెద్దయినాక తలవంచుకు తిరగవలసి వస్తుంది. మొక్కై వంగనిది మానై వంగుతుందా ఏమిటి?

* * * *

క్రిష్ణుడు చిన్నప్పటినుంచీ చాలా భయభక్తులతో పెరిగినవాడు. ఎందుకు పెరగడూ? మహాలక్ష్మమ్మగారు ఆరుగురు పిల్లల్ని కన్నది ఆరుగురూ ఆరుగురే నవరత్నాలు. ఎన్నడూ తలిదండ్రులమాట జవదాటి ఎరుగరు. పెద్ద మొగ పిల్లలిద్దరూ పెళ్ళయిన తరవాత అత్తవారి వలలోపడి తల్లి దండ్రులకు దూరమైనారుగాని పెళ్ళయ్యేవరకూ ఎంత భయభక్తులతో పెరిగారు! తరవాత ఆడపిల్లలిద్దరూ మొగుళ్ళ దగ్గర భయభక్తులతో కాపరాలు చేస్తున్నారు. కిష్టుడూ కడగొట్టు పిల్లడే ఉన్నాడు అందరు పిల్లల్ని ఆదర్శంగానే పెంచిన మహాలక్ష్మమ్మ, పెద్దపిల్లలు అట్లా దూర మైనాక కిష్టుణ్ణి ఇంకా శ్రద్ధగా పెంచింది. వాణ్ణి ఎవరి సావా సమూ చెయ్యనిచ్చేదికాదు. వెయ్యికళ్ళతో కనిపెట్టివుండేది.

అన్నం తూచినట్లు పెట్టేది. ఆకలి అయినా కాకపోయినా గడియారం ప్రకారం పెట్టేది. వాడు తిండి సరిగా తినకపోతే మొట్టి తినిపించేది. ఇంకా కావాలంటే నాలికపీక్కు చచ్చినా పెట్టేదికాదు. ఆవిడ అంత శ్రద్ధగా పెంచినా కిష్టుడు రోగిష్టిగానే వుండేవాడు. వాడికి నరాలజబ్బు వుందని డాక్టర్లు చెప్పారు. డబ్బు గుంజటానికి ఈ డాక్టర్లు ఏమైనా చెబుతారు అందుకనే వాడికి పదిరోజులకోసారి జబ్బుచేస్తే నాటు వైద్యుణ్ణి పిలిపించేది మాలక్ష్మమ్మ. ఇక ఆ నరసింహంగారి మాట చెప్పనే అక్కర్లేదు. ఆయన హుంకరిస్తే కిష్టుడు లాగులో ఉచ్చపోసుకునేవాడు. తండ్రి నడవలోకివస్తే వాడు దొడ్లో వుండేవాడన్నమాట.

♦ ♦ ♦ ♦

మాలక్ష్మమ్మ పిల్లల్ని పెంచటం విషయంలోనే కాక అన్ని విషయాలలోనూ అద్భుతమైన నియమాలుకలది. ఆవిడ ఏజంతువునూ హింసించేదికాదు. వాళ్ళింటోకి తేళ్లు వస్తే వాటిని వుపాయంగా పట్టుకుని, దారంకట్టి కర్రకొంకికి తగిలించి, కర్ర తోము కడిగి వేళ్ళను వదిలిపెట్టేది. మరోసారి వాళ్ళయింటినిండా నల్లులు పుట్టలు పుట్టలుగా బయలుదేరినై. ఆవిడ నల్లినైనా ఎన్నడూ చంపేదికాదు. నల్లులు పోవటానికి ఎవరో మంచి వుపాయం చెప్పారు. ఆవిడ ఒక పెద్ద కాగితం సంపాదించి కిష్టుడిచేత దానిమీద, చివర "సు" అనే అక్షరం వచ్చే ఊళ్లపేర్లన్నీ - రాయించి,

గూడూరు, నెల్లూరు మొదలైనవి రాయించి, ఆ కాగితం చుట్టగా చుట్టి ఇంటి కప్పుకు వేళ్ళాడగట్టింది. ఆ నాటినుంచీ ఆవిడను నల్లి కుట్టి ఎరగదు, రాత్రి పడుకుంటే భళ్లున తెల్లవారేదాకా మెలుకువ వచ్చేదికాదు.

"నీ మొహంమల్లేనే వుంది! తెల్లవార్లూ నన్ను నల్లులు చీడపీకినై." అన్నాడు నరశింహంగారు.

"మీ భ్రమ, ఇంకా నల్లి ఎక్కడ కుడుతుంది?" అన్నది మాలక్ష్మమ్మ.

"నాపక్కనిండా పాకితేనే?"

"పాకుతై, కుట్టవు," అన్నది మాలక్ష్మమ్మ.

అటువంటి మాలక్ష్మమ్మ పెంపకంలో పెరిగాడేమో కిష్టుడు కించిత్తయినా జీవహింస సహించేవాడు కాడు. వాడు కాకుల్ని, పిచ్చికల్ని, పిల్లుల్ని, కుక్కల్ని వీలయినప్పుడల్లా మేపేవాడు.

ఈవిషయమై వాణ్ణి తల్లి కోప్పడవలసికూడా వచ్చింది.

"కాకి ఆకలై అరుస్తే కొంచెం చద్దన్నం పెట్టానమ్మా," అన్నాడు కిష్టుడు భయంతో పిచ్చి మొహంవేసి.

"కాకి ఆకలి వెయ్యకపోయినా అరుస్తుంది. కాకుల్ని పక్షుల్ని చూసి జాలిపడాలి గాని అన్నంవేస్తూ కూచుంటారుట్రా?" అన్నది తల్లి.

ఈ గుణపాఠాన్ని అర్థం చేసుకోవటానికి కిష్టుడు ప్రయత్నించాడు.

వాడికి అన్ని జంతువులమీదా జాలివుందిగాని బల్లుల మీద మటుకు లేదు. వాడు రోజూ గోడమీద బల్లులు పురుగుల్ని వేటాడటంచూసేవాడు. ఒకరోజువాడుచూస్తుండగా బల్లి ఒకటి పొతంత రెక్కల పురుగును పట్టుకుంది. కిష్టుడది చూడలేక కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. కాస్సేపటికి వాడు కళ్ళు తెరచిచూస్తే బల్లివుంది గాని రెక్కలపురుగు దానినోట్లో లేదు. కిష్టుడి హృదయం ఆనందంతో పొంగి పోయింది. రెక్కలపురుగు బల్లినోట్లోపడి తప్పించుకు పోయిందనుకున్నాడు.

మరోసారి కిష్టుడు చూస్తుండగానే పిల్లి ఒకటి ఎలకని పట్టుకుంది. ఆ సమయంలో కిష్టుడు అన్నం తింటున్నాడు. పిల్లి లోపలికి వచ్చింది. దాని వాలకం చూస్తే ఏదో పెద్ద పనిమీద ఉన్నట్టు కనపడ్డది. మాలక్ష్మమ్మ "ఛీ! ఛీ!" అంది. అది వినిపించుకోలేదు. మూలఉన్న బుట్టను పంజాతో గీర సాగింది. కాస్సేపటికి అది అమాంతం దేనిమీదనో పడి దాన్ని నోట కరుచుకుని బయటికి వెళ్ళిపోయింది. కిష్టుడి కళ్ళకేదో మైకం కమ్మినట్టయి, పిల్లినోట ఉన్న ఎలిక వాడికి కనిపించలేదు.

"ఎంత ఎలికో!" అన్నది తల్లి.

కిష్టుడిక అన్నం సహించలేదు. తల్లి మొట్టికాయలతో వాడి చేత అన్నం తినిపించింది.

ఆరోజునుంచీ వాడికి పిల్లులమీద జాలి పోయింది.

*        *        *        *

కామయ్యగారి ఇంట్లో ఒక కుక్క ఉండేది. దాని కెప్పుడన్నా వాళ్లు అన్నం పెట్టేవాళ్ళు. కిష్టుడికి ఈ కుక్క అంటే ప్రాణం. "కస్తూరీ" అని పిలిస్తే అది తోకాడించు కుంటూ వాడి దగ్గరకి వచ్చేది. దాన్ని ముట్టుకుంటే ఒక ప్పుడు చూసినంతమాత్రంచేతనే, కిష్టుడి హృదయంలో ఏదో బిగబట్టి నట్టయేది. దాన్ని గట్టిగా గుండెకు అదుముకుని ఎప్పటికీ వదలకుండా ఉండాలనిపించేది. కుక్కల్ని మనుషులు ముద్దు పెట్టుకోరని కిష్టుడికి తెలుసు కాబట్టి సరిపోయింది కాని లేకపోతే, వాడు దాన్ని, ఎవరూ చూడకుండా ముద్దులు కూడా పెట్టుకునేవాడేమో.

కస్తూరికి కిష్టుడు తన చేతిమీదుగా ఎన్నడూ ఏమీ పెట్టలేదు. కాని అది ముఖ్యంకాదు. దానిమీద వాడికి చాలా జాలి. పాపం, దానికి కడుపులో నొప్పివస్తే ఎవరితోనూ చెప్పలేదుకద! ఆకలయితే అన్నం పెట్టమని అడగటానికి దానికి అమ్మలేదు కద! ఇటువంటి ఆలోచనలు రాగానే కిష్టుడికి పొర్లి పొర్లి ఏడుపు వచ్చేది.

ఒకసారి కస్తూరి నాలుగు పిల్లల్ని పెట్టింది. కిష్టుడికి ఒకరోజల్లా మనస్సు చిక్కబట్టుకొని చివరకు వాళ్లమ్మ నడి గాడు. "అమ్మా! కామయ్యగారు కస్తూరి పిల్లల్ని అందరికీ

5)

ఇచ్చేస్తున్నారు. మనం కూడా ఒకటి తెచ్చుకుందామా ?" అని.

"ఇంకా నయం ! మీ నాన్న వింటే తాట వొలిచేస్తారు" అన్నది మాలక్ష్మమ్మ. కిస్టుడిక ఆ విషయం ఎత్తలేదు.

* * * *

ఒకనాడు కిస్టుడు బడినుంచి ఇంటికి వచ్చాడు. బయట్నుంచున్నాడు. కస్తూరి కనిపించలేదు. ఆరోజే వాడు సాహసించి కస్తూరికోసం ఒక పప్పుండ తెచ్చాడు. ఆరోజు ప్రొద్దున వాడు బళ్ళోకి వెళ్ళేటప్పుడు వాడొక పప్పుండ కొనుక్కొని, కొంచెం కొరికాడు. ఇంతలో కస్తూరి జ్ఞాపకం వచ్చి కొరికిన పప్పుండ జేబులోదాచి ఇంటికి వచ్చాడు. అందుకోసం నిలబడటం జరిగింది.

చాలాసేపు చూసి విసుగెత్తి కిస్టుడు కామయ్యగారింటోకి వెళ్ళాడు. వరండాలో కస్తూరి కన్నపిల్ల ఒకటి దీనంగా కుంయి కుంయి మంటున్నది. కామయ్యగారు ప్రమిదలో పాలు పోసి దానిచేత తాగించటానికి ప్రయత్నిస్తున్నాడు.

"కామయ్య బాబుగారూ ! కస్తూరి ఏదీ ?"అన్నాడు కిస్టుడు, పరాయివాళ్లతో మాట్లాడటం అలవాటు లేని జంకుతో.

"పట్టుకెళ్ళారుగా యములవాళ్లూ!" అన్నాడాయన. కిష్టుడి కర్థంకాలేదు.

"దేనికీ?" అన్నాడు కిష్టుడు.

"ఇంకా దేనికి? చంపటానికి! ...... ఈ పిల్ల ఇంకేం బతికి చస్తుంది. పాలు పోస్తే తాగిన పిల్లలన్నిటినీ ఇచ్చేశాను. ఈ వెధవకు పాలు త్రాగటం చేతకావటంలేదు. ఆ మునిసిపాలిటీవాళ్లు దీని తల్లిని కాస్తా పొట్టన పెట్టుకున్నారు" అన్నాడు కామయ్య.

"కస్తూరి చచ్చిపోయిందా?"

"చంపితే చావదూ?"

"ఎవరు చంపారు?"

"మునిసిపాలిటీవాళ్ళు."

"ఏం చేసేదీ?

"ఏం చెయ్యకపోయినా చంపుతారు. లేకపోతే కుక్కలు పిచ్చరేగి బతకనిస్తాయా? అందుకని చంపేస్తారు."

"మంచి కుక్కల్ని కూడా చంపేస్తారా?"

"కుక్కలికి మంచేమిటి? చెడేమిటి?"

*   *   *   *

క్రిష్టుడికి ఏమయిందో తెలీదు. ఆరోజునుంచీ వాడు మారాడు. ఏది కనిపిస్తే దాన్నల్లా చంపేస్తాడు. గోడమీది

పిల్లుల్ని, మిడతల్ని, నేలమీది చీమల్ని, చెట్లమీది తొండల్ని నీళ్ళ దగ్గర కప్పల్ని బతకనివ్వడు. వాడు చూస్తుండగా వాళమ్మ తేళ్లను పట్టుకుంటే చంపేస్తాడు. నల్లుల్ని వేటాడ తాడు.

ఇది చూసి వాళ్లమ్మ విసుపోతుంటే, వాడిప్పుడు వాళమ్మ మాటా, తండ్రి మాటా కూడా లక్ష్యం చేయడు. ఒకసారి వాళ్ల నాన్న కొట్టవచ్చేప్పటికి వాడు చేతిలో వున్న పలక తండ్రి మొహాన కొట్టాడు. ఆయన మొహం అంత మేర కోసుకుపోయింది.

ఈ మార్పు వచ్చిన తరువాత కూడా కొంతకాలం వాడు కస్తూరిని తలుచుకుని చాటుగా ఏడిచేవాడు. కాని ఇప్పుడు వాడికి కస్తూరి జ్ఞాపకం రాదు. వస్తే విచారం కూడా లేదు. వాడి అంతరాత్మకు కావలసింది అదే గామాలు !

# రోడ్డు పక్కని శవం

ఆ శవం ఎవరిదో, అక్కడి కెట్లా వచ్చిందో ? ఆ మనిషి ఏ కారణంచేత చచ్చిపోయినాడో ఎవరికీ తెలియదు. రాత్రివేళ ఆ మనిషి ఎవరో అక్కడికి వచ్చి పడుకుని చనిపోయి ఉండాలి ఆ రోడ్డుపక్క. లేదా ఎవరైనా — ఎవ్వరు, వాణ్ణెవరు చంపుతారు ?

ఝామున పొద్దెక్కేదాకా అది శవమని ఎవరూ గమనించలేదు. అందుచేత ఎవరూ ఆగి తొంగి చూడలేదు. శవమని తెలిశాకనే కొందరు ఆగి తొంగిచూశారు. కాస్సేపు నిలబడి వెళ్ళిపోయారు. బతికుండగా కన్న చచ్చి ఎక్కువ మందిని ఆకర్షించేటట్టు బ్రహ్మదేవుడి వరం ఉంది మనిషికి. శవాన్ని చూడగానే ఎవరి అభిమాన తత్వాలను వారు స్మరించటం రివాజు.

పుట్టినవాడు గిట్టక తప్పదు.
ఎవరి కెక్కడ చావు రాసిపెట్టి ఉందో.
ఈ సంఘంలో దరిద్రుల గతి ఇంతే.

దేవదాసు చచ్చిన సందర్భంలో శరత్ ఏమిటన్నాడూ !

ఆ శవాన్ని గురించి అందరూ ప్రశ్నలడిగేవారే గాని చెప్పేవాళ్ళు లేరు. కాని క్రొత్తిగా ఎవరికీ దాన్ని గురించి ఏమీ తెలియదన్నట్లేవటం పొరపాటు. ఎందుకంటే, అజ్ఞానం మనుష్యుల నాకర్షిస్తుంది. సం జరుగుతున్నదీ తెలియని చోట ఎక్కువమంది చేరతారు. ఈ శవం దగ్గర పదిమంది కూడా గట్టిగా గుమిగూడలేదు

ఇది సంపన్నుడి శవం కాదు, మధ్యతరగతి శవం కూడా కాదు. అఖరుకు తన పొట్ట పోసుకుంటూ ఉండిన కూలివాడి శవమైనా కాదు. మనిషి బతికుండగా ఉండిన హోదా కొంత శవానికి సంక్రమిస్తుంది. నేనొకసారి శ్మశానం దగ్గర ఒక శవాన్ని చూశాను. ఇది మెత్తని పరుపుల మీద తీసుకుని, ఖరీదైన ఇంజెక్షన్లతో ప్రాణం విడిచిన మనిషి శవమని, చూడగానే గ్రహించాను.

చచ్చేటప్పుడు మనిషికి బతికుండగా లేని హోదా రావాలంటే, ఆ మనిషి దుర్మరణంపాలు కావాలి, ఎవరైనా పొడిచి చంపాలి, నీళ్ళలో మునిగి చావాలి, రైలు కిందనో, కారుకిందనో పడి చావాలి. పోలీసుల నాకర్షించని శవం—అంటే, ఇతర ఆకర్షణలు లేనప్పుడు – ప్రజల నాకర్షించదు.

అనాదరణకీ, చలికీ, ఆకలికీ గురియై చచ్చినవాడు లోకాన్ని ఆకర్షించిననాడు లోకంలో మనుషులు అనాదరణకీ, చలికీ, ఆకలికీ, చావటం మానేస్తారు. మనిషి ఘాతుకుడు.

ఫాలం విప్పి మనిషి ఏ సమస్యకేసి చూసినా, ఆ సమస్య యొక్క స్వరూపం మారిపోతుంది. అయితే తాను ఫాలాక్షుడన్న విషయం మనిషికి తెలీదు. అందుచేత ఫాలం విప్పడు, శివోహం అనుకోడు.

ఒక మగవాడూ ఆడదీ చేరి శవం కోసం యాచన ఆరంభించారు అక్కడ చేరి చూస్తున్న నలుగు రయిదుగురూ కూడా తొందరపనులు జ్ఞాపకం వచ్చి నిష్క్రమించారు. చచ్చిపోయిన ఆ దరిద్రుడి దారిద్ర్యాన్ని పంచుకోటానికి ఎవరికి ఉత్సాహం ఉంటుంది ? సంఘంలో ఆ శవానికున్న ప్రాముఖ్యాన్ని గుర్తించిన ధనికులు తమతమ ఉత్సాహం కొద్దీ అణాలూ, బేడ కాసులూ ఇచ్చారు.

అవును, ఆ శవానికి సంఘంలో అతి విలువైన స్థానం ఉంది. దేశ సంపదలో మిగిలిన వాళ్ళకి మరి కొంచెం పెద్దవాటా వచ్చేందుకు ఈ శవం దారిద్ర్యంలో ఓలలాడింది; వీడు అన్నానికి లేక కొంతకాలం మాడటం వల్ల ధనికుల కుక్కలకి ఒక మెతుకు అన్నం ఎక్కువ దొరికింది; వీడు చెట్ల కింద నివసించటం వల్ల ఒక ఆసామికి ఉండ ఇల్లు దొరికింది; వీడు చావటంవల్ల భూభారం కొంత తగ్గింది. ప్రపంచంలో వీ డొక్కడా ? వీడిలాటివాళ్ళు లక్షలున్నారు. ఆ సంపదలో వాటా అని, ఆ అన్నం మెతుకులనీ, ఆ ఇళ్ళనీ లక్షలుపెట్టి గుణించండి, కోట్లుపెట్టి గుణించండి, భూభారం తెలుస్తుంది.

# 2

వీడు సంపన్నుడు కాడు, మధ్యతరగతి కాడు, కూలి వాడైనా కాడు. అని మనకి తెలుసు. వీడు బిచ్చగాడైనా కాడు, కాని బిచ్చం ఎత్తటం ఎత్తాడు. చేసేటందుకు పని లేకపోతే, ఆకలి దహించుకుపోతుంటే, రోజులు తరబడి నీ పెళ్ళాం పిల్లల కింత గంజినీళ్ళయినా గతిలేకపోతే బిచ్చం ఎత్తక ఏంచేస్తావు ?.

బిచ్చం ఎత్తటం మాత్రం అందరికీ చాతవుతుందా? బిచ్చగాళ్ళలో మహారాజులున్నారు, మహామంత్రులున్నారు. అది వాళ్ళసొమ్ము, వాళ్ళవిద్య, వాళ్ళ కళ. అవన్నీ నీకు చాతకానప్పుడు దారేపొయ్యేవాణ్ణి నిలవదీసి అటకాయించ లేవు. పలకరిస్తావు. అవతలివాడు వినిపించుకోకుండా దాటి పోగానే పెద్ద గండం గడిచినట్టు సంతోషిస్తావు. కాని, ఆ సంతోషం ఎంతసేపు దక్కుతుంది ? ఇవతల నీ ఆరాటం నిన్ను ఊరుకోనిస్తుందా? మళ్ళీ ఇంకోణ్ణి పలకరిస్తావు? లాభం లేదు. అయిదారుగురు దాటిపోయినాక నీ ఆత్రం రెచ్చిపోయి ఈ సారి పక్కగా వచ్చినవాడికేసి అరుస్తావు. నీ గొంతులో కంగారుచూస్తే నీకే అసహ్యం వేస్తుంది. అవతల మనిషికి అదెట్లా వుంటుందో నీకు తెలుసు. నీ కేకకు ఆ మనిషి నీకేసిచూస్తాడు—దొంగతనం చేస్తున్నవాణ్ణి పట్టుకున్నట్టుగా, నీకూడా దొంగతనం చేసి దొరికిపోయినట్టే వుంటుంది.

ఏదో గొణుగుతావు. ఆ మనిషి నీకేసి కోపంగా చూసి వెళ్ళిపోతాడు—దమ్మిడీ ఇవ్వకుండా... ఎక్కడన్నా ఒకడు నీకేసి ఆత్రంగా చూసి నీ కళ్ళల్లో ఏదో వెతుకుతాడు. నీ అవసరం వాడికి చాలవరకు అర్థమవుతుంది: కాని నూరు వంతులు వాడి దగ్గిర డబ్బుండదు, నీ కివ్వటానికి... నీకా క్షణంలో బిచ్చగాళ్ళని చూస్తే అసూయేస్తుంది. బిచ్చం మీద అపరిమితమైన అసహ్యంకూడా వేస్తుంది. నీకు చదువు రానక్కర్లేదు. నువ్వు ఘరానా మనిషివి కానక్కర్లేదు:— బిచ్చమెత్తటం, ఒక విద్యగా అభ్యసించటానికి, ఎంత హేయమైనదో నీకే స్పష్టంగా తెలుస్తుంది. కాని, ఏం చేస్తావు? చేసేటందుకు నీకేం చేతనవును? ఏదైనా చెయ్యటానికి నువ్వెవడవు? ఈ జగన్నాథ రథాన్ని నీవంటి అర్భకుడు కదిలించనా? వొట్టిది. నీవంటి అర్భకులొక వెయ్యిమంది కలిస్తే రథాన్ని ఎటుపడితే అటు ఈడ్చి పారెయ్యగలరు? కాని నీ దృష్టి నీవాళ్ళమీద లేదే, తెల్లగుడ్డలవాళ్ళమీదా, ఇల్లుగల వాళ్ళమీదా, తిండి తింటున్న వాళ్ళమీందా, ఆస్తిపాస్తులుగల వాళ్ళమీదా వుంటుంది. అంతే నీ ఖర్మ! ఆ రథచక్రం క్రింద పడి నలిగిపో. నువ్వు కదలించలేకపోతే ఇంకా కదిలించే వాళ్ళున్నారు. వాళ్ళు రథాన్ని వాళ్ళపక్కకు లాక్కుంటున్నారు. నువ్వు వాళ్ళ దారిలో వున్నావు తొలగలేవు.

పోనీ దొంగతనాలు చేస్తావా? ఎవరి జేబులన్నా

కత్తిరిస్తావా? ఎవరింటికన్నా కన్నాలువేస్తావా? పోలీసులున్నారు జాగర్త!

ఆ త్రాంకొద్ది దొంగతనం చేశావేమో? జైలుకెళ్ళావేమో? జైల్లో బాగాలేదుకదూ? ఆ మిగిలిన దొంగలు నీవాళ్ళు కారు. వాళ్ళు పెద్దమనుషులు. వాళ్ళు నీ మాదిరిగా కూలిచేశారా? లేదు! వాళ్ళకున్న ప్రపంచ జ్ఞానంలో నీకెన్నో వంతుంది? దొంగతనమూ ఒకవిద్యే! వాళ్ళు చెప్పే కథలన్నీ విన్నావుకాదూ? వాళ్ళ కోతలన్నీ నమ్మావేమో కూడానూ? అయినా నీకు వాళ్ళమీద భక్తికుదరలేదు. వాళ్ళవెంట జైల్లో వుండటం నీకు నీచంగా తోచింది.

నీది వెధవజన్మ. నీచమైన పనులు చేయవు, ఘనమైన పనులు చెయ్యలేవు. నువు బతికేటందుకు మూడోదారిలేదు. అందుకని కాళ్ళు డొక్కలో పెట్టుకుని రోడ్డుపక్కన పడుకుని చచ్చిపో!...

## 3

ఈ మనిషి అకస్మాత్తుగా చావలేదు. స్పృహతప్పిన చాలా గంటలకి చచ్చాడు. ఈలోపుగా వీడుకలలుకన్నాడు. అవి ఫ్రాయిడియన్ కలలు కావు, ఉటోపియన్ కలలుకావు. అవి పీడకలలుకూడా కావు. జన్మలో ఎన్నడూ వీడు ఎరిగి

వుండని ఆనందం ఈ కలల మూలంగా వీడు పొందాడు. అవి వాడికి కలలల్లే లేవు, పచ్చి యదార్థంకన్న నిజంగా వున్నాయి.

మామూలు మనుషులు—అంటే రోజుకు రెండు పూటలా తిండితిని, సంఘంలో ఒక మనిషల్లే తినేవాడెవడూ —కనే కలలు కావవి. అసలటువంటి కలలు కనాలని మామూలు మనుషులనుకోరు అనుకోవటానికీ కలలకీ ఆపాటి సంబంధం వుండదా?

వీడికి కల పూరిపాకలో ఆరంభమైంది. చక్కని ఒంటి నిట్టాడిపాకా, చుట్టూ పేడలికిన తడికలు, పాకమీద ఒక సొరపాదు పాకింది. దానికి లెక్కపెట్టలేనన్ని కాయలు కాసినై. ఆకుపచ్చని పెద్దపెద్ద ఆకులు కప్పంతా కప్పేసినై. సూర్యకాంతి ఆ ఆకుపచ్చని ఆకులగుండా నేరుగా, మధ్య తాటాకులు అడ్డం లేకట్టు, పాకలోకి పడుతున్నది. పాకలో ఒక ఆడకూతురు వంటచేస్తున్నది. ఉడుకుతున్న అన్నం వాసనా, వెల్లుల్లి వాసనా, కాగుతున్న పులుసు వాసనా ముక్కుల్లోకి వస్తున్నది. ఆ ఆడకూతురు తిన పెళ్ళాం అయి వుండాలి ఎర్రచీర కట్టుకున్నది అటూ ఇటూ తిరుగుతుంటే మట్టెలు మట్టినేలకి తగిలిన అస్పష్టమైన చప్పుడు వినిపిస్తున్నది. రెండు పొయిలకింద చితుకులు మంటలు పచ్చ పచ్చగా ఎర్ర ఎర్రగా కళ్ళకి ఎంతో ఆనందం కలిగిస్తునై

ఈ లోకంలో ఒక మనిషి ప్రాణానికి అంత ఆనందం ఇచ్చేందుకు ఏముంది? వీడికి కల ఎందుకింత ఆనందం

ఇచ్చింది? ఆ కలని వొదిలేసి రెండో కలకి వాడి మనస్సు ఎంతసేపటికీ పోలేకపోయింది.

తను చేనుకట్టున నిలబడ్డాడు. ఆ చేను ఎవరిదో తనకి తెలీదు. ఒకవేళ తనదేనేమో. ఆ గుడిసెమాదిరిగానే ఈ చేనుకూడా ఎవరిదనే ప్రసక్తిలేకుండానే తనకి అంత ఆనందం ఇచ్చింది. చేను బాగా ఏపుగా పెరిగింది. కంకి వేసింది. పొట్టలుకూడా పోసుకున్నై కాని ఇంకా కోతకి రాలేదు! పక్కన కాలవలో ఎడ్లు నీళ్లుతాగుతున్నై. వాటి మెళ్ళో మువ్వల చప్పుడు వినిపిస్తున్నది. చేనుమీదినుంచి గాలి తన మీదికి కొడుతున్నది. పైరువాసన ముక్కుకి తగులుతున్నది. ఎంత ఆనందంగా వుంది!

ఇందులో ఏదీకి ఆనందం కలిగించేటందు కేముందో చెప్పటం కష్టం. కాని వాడి ఆనందానికి మేరలేదు ఆ కలని విడిచి వాడి మనస్సు మరో కలకి ఎంతసేపటికీ పోలేక పోయింది.

అదొక పెద్దయిల్లు. దానికెక్కడా గోడలూ, వాకిళ్ళూ ఉన్నట్లులేదు. రాత్రివేళ కాబోలు; ఎక్కడ చూసినా దీపాలే. అంతటా మనుషులే. మగవాళ్ళూ ఆడ వాళ్ళూ, పిల్లలు గుంపులు గుంపులుగా వున్నారు ఒక్కొకరు ఒక్కొకుటుంబం. ఎవరి పనుల్లో వాళ్లున్నారు ఎవరూ ఏమీ మాట్లాడుతున్నట్లులేదు. కాని ఒకరుచేసేపని మరొకరికి తెలుసును. ఒకరి పనికి ఒకరి పనికీ సంబంధం వుంది. అంతా వేరువేరు పనులమీద వున్నా అందరూ కలిసి చేస్తున్నపని ఒకటే అని తనకి తెలుసు. అది అవసరమైన పనేగాని గొప్ప

పనికాదు. ఇదంతా తనకి ఎట్లాగో తెలుసును. వాళ్ళలో ఎవరూ తనని పలకరించటంలేదు. కాని వాళ్ళంతా తనకు కావలసిన వాళ్ళేనని కూడా తెలుసును. తనకూ వాళ్లకూ మధ్య వున్నది చుట్టరికం కాదు, స్నేహంకాదు, అంతకన్న కూడా సహజమైనదీ విశాలమైనదీనూ. వాళ్లందరూ చేస్తున్న అన్ని పనులూ కలిసి తనపనే. అక్కడ వున్న అన్నివేల మందికీ మధ్య ఒక చిన్న అభిప్రాయభేదంలేదు. వాళ్లందరికీ తనలోనూ, తనకు వాళ్ళలోనూ నూరుపాళ్ళు విశ్వాసం వుంది. తనుకూర్చున్నదీ, నుంచున్నదీ, పడుకున్నదీ కూడా తనకే తెలీదు. తను ఏంచేస్తున్నదీ అవసరంలేదు. వాళ్లందర్నీ చూస్తుంటే తనకెంతో ఆనందంగా వుంది. వాళ్లని తను పలకరించ నవసరంలేదు. "మీరు నా వాళ్లు నేను మీ వాణ్ణి" అని చెప్ప నవసరంలేదు. వాళ్లకామాట తెలుసును. వాళ్లనట్లా చూస్తూ ఉండటంకంటె ఆనందంలేదు తనకు నిద్రవచ్చేస్తున్నది. కళ్ళుమూసుకు నిద్రపోవాలి. కళ్ళు మూసుకున్నాడు. కాని వాళ్లు తనచుట్టూ వున్నారని తెలుసు వాళ్లక్కడే వుంటారు. తనవంతు పనులుకూడా వాళ్లే చేసేస్తారు తను మళ్ళీ ఎప్పుడు కళ్లు తెరిస్తే అప్పుడు వాళ్లంతా అక్కడే వుంటారు. క్రమంగా అన్ని చప్పుళ్లూ అంతరించినై. మూసుకున్న కళ్ల ఎదుట కనిపిస్తూ ఉండిన వెచ్చని వెల్తురుకూడా క్రమంగా గాఢాంధకారంగా మారి పోయింది. అతని మనస్సు నిశ్చైతన్యంలోకి వెళ్లిపోయింది...

# అమోఘ వచనం

ఒకనాటి సాయంకాలం బ్రహ్మకూ, ఆయన భార్యామతల్లి అయిన సరస్వతికీ చిన్న వాగ్వాదం ప్రారంభమయినది.

"ఏమండీ, సృష్టికర్త అనే ఖ్యాతి యావత్తూ మీకే వచ్చిందిగాని నాకెందుకు రాలేదు?" అన్నది సరస్వతి.

"సృష్టి చేసింది నేనేగా?" అన్నాడు బ్రహ్మ.

"నేను మాత్రం మీకు సహాయపడలా?"

"సృష్టి చెయ్యటంలోనా? ఎట్లా?"

"మీరు సృష్టించిన మానవులకు వాక్కు ప్రసాదించింది నేను కాదూ?"

"అయితే మటుకు?"

"నా ప్రభావంచేత మానవుడు సృష్టిలో సర్వోత్కృష్టుడుగా పరిణమించలా? ఇతర సృష్టినంతా అతికట్టి,

తనే ఒక బ్రహ్మయి తనకు తానే సృష్టి చెయ్యటం నేరవలా? ఆ ఖ్యాతి న్యాయంగా నాది కాదూ ?"

పురాణ దంపతుల్లో అంతఃకలహాలు బొత్తిగా లేని సంసారం బ్రహ్మదేవుడిదే. అటువంటి అన్యోన్య దంపతులు ఈ స్వల్పవిషయంమీద కలహించుకోసాగారు. బ్రహ్మదేవుడు తన భార్య తనమీదకి పోటీవస్తున్నందుకు అసూయపడ్డాడు.

తన భర్త తనని అన్యాయం చేస్తున్నందుకు రోషం తెచ్చుకున్నది సరస్వతి. మాటమీద మాట పెరిగి సరస్వతీ-బ్రహ్మల కలహం మిన్నుముట్టింది.

ఈ సమయంలోనే దేవుడల్లే నారదుడు అక్కడికి వచ్చాడు.

ఇతిహాసం నారదుడికి రెండు విషయాల్లో అన్యాయం చేసింది. అతనికి 'లోకసంచారి' అనే పేరు అకారణంగా వచ్చింది. అతడు నిజంగా తిరుగుబోతు కాదు. మనరిపోర్టర్లకంటే, మన భీమా ఏజంట్లకంటే, తారలను బుక్ చెయ్యడానికీ, షేర్లు పోగుచేయటానికీ మన ప్రొడ్యూసర్లకంటే, పైత్యపుదడ వచ్చినప్పుడు మన తలకాయలకంటే, చాలా డబ్బు ఒక్కసారిగా చూసినప్పుడు మన కళ్ళకంటే, పిక్చరు రిలీజునాడు మన డైరెక్టర్ల బుర్రలకంటే ఎక్కువ తిరిగేవాడు కాదు నారదుడు. కాని ఆయన ఎక్కడికిపోయినా పనిమీద పోక, 'ఊరకనే' వెళ్ళేవాడు గనుక అతనికి తిరుగుబోతన్నే బిరుదనామం వచ్చింది.

నారదుడు కలహప్రియుడు కూడా కాదు. ఆయన తనంతట తను ఏ పోట్లాటా ప్రారంభింపజేసి ఎరగడు. మీదు మిక్కిలి ఆయనకు పోట్లాటలు తుదముట్టించడం హాబీ. అయితే ఏ జాడ్యమైనా కొంత ఉద్రేకించినమీదట గాని సమూలంగా చికిత్సకాదు. గనుక, నారదుడు పోట్లాటలను పెంచి, పక్వానికి తెచ్చేవాడు. ఇతరులు పోట్లాటలను అణచి పెడతారు. అది ప్రమాదమని నారదుడెరుగును.

“నా మానస జననీజనకులేదో విలాసార్థం తర్కించు కుంటున్నట్టున్నారే!” అన్నాడు నారదుడు.

నారదుణ్ణి కూచోబెట్టి సరస్వతీ బ్రహ్మ తమ కలహ కారణం చెప్పారు. అంతా విని నారదుడు తీర్పు చెప్పటానికి ఉపక్రమించాడు.

“తల్లిగారు సాయపడేవరకూ నాన్నగారు కలరా పురుగులూ, ప్లేగు క్రిములూ, మహమ్మారి క్రిములూ మొదలుకొని తేళ్లూ, నల్లి, కళ్లపాములూ, కాళ్లజెర్రులూ, తాచులూ, కప్పలూ, కంచిరీగలూ, కాకులూ, బొద్దింకలూ, గద్దలూ, కాళ్లజెర్రులూ, సింహాలూ, పులులూ, కుందేళ్లూ మొసళ్లూ మొదలైన క్షుద్ర మృగాలను సృష్టించినమాట వాస్తవమే. ఆయన సృష్టిలో తోకలేని కోతికంటే ఉత్తను మైన జంతువు తయారుకాలేదు.

“తల్లిగారి ప్రభావంవల్ల మానవుడు వాక్కు పొంద గలిగాడు. తక్షణమే వేదాలూ, ఉపనిషత్తులూ, పురాణేతి

హాసాలూ, శాస్త్రాలూ, విజ్ఞానమూ, కళా, సంస్కారమూ, నాగరికతా భూమి మీదికి అవతరించినై అనేక కోట్ల శతాబ్దాలుగా తండ్రిగారు ఒంటరిగా సాధించలేని పని తల్లిగారు బహు స్వల్పకాలంలో ఇట్టే సాధించగలిగింది” అన్నాడు నారదుడు.

బ్రహ్మ మొహం ముడుచుకున్నది. కాని సరస్వతి మెరిసే కళ్ళతో “నారదుడు యదార్థం కనిపెట్టాడు!” అన్నది.

“అయితే” అన్నాడు నారదుడు. సరస్వతి ప్రాణం చివుక్కుమనేటట్టు, “తండ్రిగారిసహాయం లేకపోయినట్టయితే మానవుడికి వాగ్దానం చెయ్యటం తల్లిగారికి సాధ్యమైవుండేది కాదు. మానవుడంటూ ఒకడు సృష్టి అయినాక ఆవిడ ఆ మానవుడికి వాక్కు ప్రసాదించగలిగింది గాని, తేళ్ళకూ, లేళ్ళకూ, కోళ్ళకూ ఆవిడ వాక్కు ఇవ్వగలిగిందా?”

“అదీగాకా” అన్నాడు నారదుడు, సరస్వతి అగ్నిపర్వతమల్లే అయిపోతూ ఉండటం గమనించకుండా. “మానవుడికి వాగ్దానం చెయ్యటంలో తల్లిగారు కొంత తొందరపడ్డదేమో ననుకోవడానికి అవకాశం కనిపిస్తున్నది. ఏమంటే, భూమిమీదికి సకల విద్యలూ, సకల శాస్త్రాలూ అవతరించినప్పటికీ అవి మానవుణ్ణి పాతిత్యం నుంచి రక్షించలేకుండా ఉన్నై. వాటి ఫలితాన్ని మానవుడు పొందలేకుండా ఉన్నాడు.

క్రియకు మానవుడు తన వాక్కును అబద్ధాలాడటానికి, తిట్ట టానికి, అవాచ్యాలూ, అశ్లీలాలూ ఉచ్ఛరించటానికి ప్రయో గిస్తున్నాడు. మందులమ్ముకోవటానికి, ఎలక్షను ఉపన్యా సాలు చెయ్యటానికి, విప్లవాలు ప్రచారం చెయ్యటానికి ఉప యోగపడుతున్నది మానవుడి వాక్కు. పైగా మానవుడు మాట్లాడటం నేర్చి కొంత నష్టపడ్డాడు కూడాను. జంతువులు మాటసహాయం అవసరం లేకుండానే ఒకదాన్ని ఒకటి అర్థం చేసుకుంటై. ఒకజాతి మృగాన్ని మరొకజాతి మృగం కూడా అర్థం చేసుకుంటుంది. కాని మానవుడు మానవుణ్ణి వాక్కు ద్వారా బొత్తిగా అర్థం చేసుకోలేకుండానే ఉన్నాడు. మీకు చెబితే ఆశ్చర్యం కలగొచ్చుగాని ఒక యజమాని తన కుక్కను అర్థం చేసుకునేదానికన్న ఆ కుక్కే తన యజమా నిని బాగా అర్థం చేసుకుంటుంది. ఆఖరుకు ఒకరి నొకరు అర్థం చేసుకోవటం మానవుల్లో ఘనత కూడా అయింది. కావలిస్తే మానవ కవిత్వం చూడండి!"

ముకుళించిన బ్రహ్మ యొక్క ముఖం తిరిగి సంపూ ర్ణంగా వికసించింది.

"కాని" అన్నాడు నారదుడు, మళ్ళీ ఒక కొత్తదారి తొక్కుతూ. "ఈ తప్పు తల్లిగారిచే ననటానికి వీల్లేదు. తండ్రి గారు ప్రాణికోటి యొక్క ఉపయోగార్థం ఇచ్చిన శక్తులు అమోఘంగా పనిచేస్తూఉన్నై. అవి భుజించి క్షుధ్నివారణ చేసుకుంటూన్నై. నీరుతాగి దాహశమనం చేసుకుంటూన్నై. దాంపత్య జీవనం ద్వారా జాతిని విస్తరించుకొంటూన్నై.

కాని మానవుడు మాట్లాడి ఏమీ చెయ్యలేకుండా ఉన్నాడు. మానవుడు బ్రహ్మ నిర్దేశానుసారం కర్మచేస్తే కర్మ ఫలితం వెంటనే కనిపిస్తున్నది. సారస్వతా నిర్దేశానుసారం మాట్లాడి నప్పుడు ఏమీ జరగటం లేదు. తల్లిగారి వరం నిర్వీర్యమై పోయింది" అన్నాడు నారదుడు.

"ఈ తప్పు మీదే! మీరే ఇంతపని చేశారు!" అన్నది సరస్వతి, బ్రహ్మమీదికి కోడె తాచల్లే లేస్తూ.

"మానవుడికే అమోఘవచనం ఉంటే —" అని సన్నగా అంటున్నాడు నారదుడు.

"ఉంటుంది! ఉండి తీరుతుంది! ఎందుకుండదో చూస్తాను! మీరు తక్షణం మానవుడికి అమోఘవచనం ఇస్తారా, ఇవ్వరా?" అన్నది సరస్వతి.

"ఇదంతా నీ దుర్బుద్ధేరా అబ్బాయి!" అన్నాడు బ్రహ్మ నారదుడుకేసి దీనంగా చూస్తూ.

"అతన్ని అంటారేమిటి? అతడు బుద్ధిమంతుడు నిజం ఎంత చక్కగా బయటపెట్టాడు! నేను మిమ్మల్ని నమ్మి మోసపోయినాను!"

"నన్ను మానవుడికి అమోఘవచనం ఎలా ఇమ్మంటావు? కొంప పోతుంది! లోకాలు తల్లక్రిందులవుతై!"

"ఆమాట నిజమా?" అన్నది సరస్వతి నారదునితో.

నారదుడు ఆలోచన అభినయించి, తన వీణ తాలూకు

మందరం మీటుతూ, "ఏ శక్తినైనా జీవి దుర్వినియోగ పరిచే అవకాశం ఉంది. అందుకని సృష్టిలో——"

"ఏ శక్తీ లేకుండా చేస్తామా ?" అని పూర్తిచేసింది సరస్వతి.

బ్రహ్మ నాలుగు తలలతోనూ సమ్యగాలోచన చేశాడు.

"ని సలహా ఏమిటో చెప్పరా నాయనా ! నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను. నా మూలంగా ఎవరికి కష్టం కలిగినా నాకు బాధే ! ఒకవేళ మీ తల్లి అన్న ప్రకారం చేసినా, తరవాత అందువల్ల చిక్కు దాపరిస్తే ఆ తప్పు నా నెత్తిమీదే వేసి, ఇంకోవిధంగా చేస్తే చిక్కువచ్చేది కాదం టుంది ! మా ఇద్దరికి నచ్చే సలహా ఏమిటో నువ్వే చెప్పు!

నారదుడు మళ్ళీ ఆలోచించి, "ఒక్కసారిగా మానవు లందరికి అమోఘ వచనం ఇవ్వటంకంటే, నా బుద్ధికి, ఏ ఒక్కడికో, తల్లిగారు ఎన్నుకునే వ్యక్తికి అమోఘవచన ప్రసాదం చేసిచూస్తే, అది ఎలా పరిణమిస్తుందో చూసి, అటు పిమ్మట అవసరమైతే ఇతర మానవకోటికి కూడా ఆ వరం అమలులో పెట్టటం బాగుంటుందని ఉంది. ఇలా చెయ్యటం మీకు సమ్మతమేనా ?" అన్నాడు.

"ఓ !" అన్నది సరస్వతి.

"నాకు తప్పేదేముంది !" అన్నాడు బ్రహ్మ.

## 2

శివన్న శాస్త్రుల్లు చాలా సద్బ్రాహ్మడు. వేదాలూ, వేదాంతాలూ పడ చదివినవాడు. లౌక్యం ఎరగక దారిద్ర ములో ఉన్నాడు. ఆయనా, ఆయన భార్యా, ఏడెనిమిది మంది పిల్లలూ ఒక పల్లెటూళ్ళో ఊరిబయట ఒక చిన్న గుడిసెలో నివసిస్తూ ఉండేవారు. ఆయనకు విరోధులూ, విహితులూ లేరు. అమోఘ వచనం ప్రసాదించడానికి ఆయ నను ఎన్నుకొన్నది సరస్వతీదేవి.

శివన్న శాస్త్రుల్లు అలవాటుచొప్పున ఆనాడు అరుణో దయంవేళ లేని నిత్యకృత్యాలు నెరవేర్చి, వీధి అరుగులో సంధ్యావందనం చేసుకోటానికి కూర్చున్నాడు కాని ఆయన మనస్సు చేసే పనిలో లగ్నం కావటంలేదు. నిద్రలేచింది లగాయతూ తనలో ఏదో మార్పు కలిగినట్టు అర్థమవుతూ ఉండింది. పక్కమీద లేచి కూర్చుంటూనే, ఇల్లంతా కలయ జూసి శాస్త్రుల్లు, "ఏమిటీ కొంప ? ఇంత చిన్న ఇంట్లో పది మంది ఉండటమేమిటి ప్రపంచానికి వైశాల్యం లేనట్టు ! పెద్ద ఎకరం మేర ఇల్లు కట్టటం అసంభవమైనట్టు! వాకిళ్ళలోనుంచి వంగిపోవట మేమిటి ? అరమగుల వాకిళ్ళు శాస్త్రవిరుద్ధమై నట్టు ! ఈ ప్రపంచమంతా ఏమిటి ? వెధవ మనుషులు ! పురుగులల్లే ! బురదగుంటలో చాపలల్లే! ఇందులో కొందరు దరిద్రులూ, కొందరు సంపన్నులూనూ ! కొందరు తిండిలేక

మాడేవాళ్ళూ! పొలాలు పండనట్టు! డబ్బు ఒక చేతికే అతుక్కుపోయి ఇంకో చేతికి పోమ్మంటే పోనట్టు!.... ఈ ధోరణిలో ఆయన ఆలోచనలు ఆయన ప్రయత్నం లేకుండానే పోసాగినై. తనపేరు శివన్నశాస్త్రులేమిటి? తనకు పేరెక్కడుంది? ఏమిటి నాటకమంతా? తనని పిచ్చివాణ్ణి చేసి సాటి మానవులంతా ఆడిస్తున్నట్టు ఆయనకు అనుమానం కలిగింది. తనపేరు శివన్నశాస్త్రుల్లని నమ్మించారు! తనంత వేదాధ్యాయపరుడు లేడని నమ్మించారు! చదివితే వాళ్ళకు వేదాలు రానట్టు! అన్నీ వట్టివే! వాళ్ళకు వేదాలక్కర్లేదు. పిచ్చిముండాకొడుకై తను చదివినందుకు తన్నివిధంగా ఆడిస్తున్నారు. ప్రపంచం నిండా ఉద్యోగస్తులున్నారు, అధికార్లున్నారు, రాజులున్నారు, ఎక్కడో దేవతలున్నారు. ప్రతి వెధవా కడుపు వెధవల్ని మోసం చేస్తున్నవాడే! ఎందుకూ? ఎందుకీ మోసం? తను ఏ రాజుకంటె తక్కువా? ఎందుకు తక్కువా? ఏ దేవతకంటె ఎందుకుతక్కువా? జీవితమంతా ఒక్కసారి ఋజువుకావలసిన అవసరం లేదూ? సృష్టి యావత్తూ ఋజువుకావాలి! ఎవరు మోసగాడు, ఎంత మోసం జరుగుతున్నదో? తనకు వేరేపని ఏముంది కనకా! సృష్టిని ఋజువు చెయ్యటం తన పనిగా ఎందుకు పెట్టుకోకూడదూ?

సూర్యోదయ మయిందిగాని తాను ఇంకా తర్పణాలు విడవలేదు అయినా ఫరవాలేదు సూర్యుణ్ణి ముందు ఋజువు చెయ్యాలి తర్పణాలు విడవని కారణంచేత సూర్యుడు ఉదయించలేకపోతే అందరూ సంధ్యావందనం మానేసి

సూర్యుడి అంతు కనుక్కోవచ్చునే! ఇంతకాలమూ తను ఎంత మౌఢ్యంలో ఉండిపోయినాడూ!

అతిసౌమ్యుడైన శివన్నశాస్త్రుల్లు ఇట్లా మారిపోవటం వింతలేదు. అతి బలహీనమైన గోడలుగల ఇంట్లో కొత్తగా ఒక స్టీముయంత్రం నడపనాగితే ఇల్లు తనని తను అపాయకరంగా ఆత్మపరీక్ష చేసుకోసాగుతుంది. అతిబలహీనుడైనవాడు, అరగ్లాసు సారాయి తాగినా అపనే జరుగుతుంది. ఎన్నడూ ఏశక్తీ ఎరగని శివన్నశాస్త్రుల్లుకు సరస్వతీ కృప వల్ల ఏ మానవుడూ ఎన్నడూ—ఏ యుగంలోకూడా—పొందలేకపోయిన వరం లభించింది. ఆ తాకిడికి అతని మనోబుద్ధి చిత్తాహంకారాలన్నీ ఉద్రూత లూగసాగినవంటే ఆశ్చర్యం ఏమిటి?

ఆకాశాన్ని దూసుకుని బ్రహ్మాండపు చివరలను ఎగబ్రాకుతూన్న శివన్నశాస్త్రుల్లు ఆలోచనలకు భంగం కలిగింది. వెదురుబద్దల వాకిలి కిర్రుమన్నది. వీధిచివర వుండే సుబ్బన్నశాస్త్రుల్లు వీభూధిరేఖలు తీర్చివచ్చి "శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః" అన్నాడు. శివన్నశాస్త్రుల్లుకు తారామండలంగా మండింది. తనకంటెకూడా బీదవాడల్లే నటిస్తాడెందుకు ఈ సుబ్బన్నశాస్త్రుల్లు? ఎంత బీదవాడైతే అంత భాగ్యవంతుడి దగ్గరికి పోవాలి. న్యాయంగా—వాడి దారిద్ర్యం అంతకన్న అధికమైనదిగనక దాన్ని తీర్చటానికి అంత ధనికుడే కావాలి. ఈ సుబ్బన్నశాస్త్రుల్లు తనఇంటికి కొస్తాడెందుకూ? కరణంగారింటికి పోయి ఒక బస్తావడ్లు తెచ్చుకోరాదూ?

"ఇంట్లో బియ్యం నింపుకున్నాయోయ్ సుబ్బన్న శాస్త్రుల్లూ!" అన్నాడు శివన్న శాస్త్రుల్లు. అమాట ఆయన నోటివెంట అదివరకెన్నడూ రాలేదు. ఐనా ఇప్పుడది ఆయన నోటివెంట అలవాటున్నట్టే, బాగా ధాటీగానే వచ్చింది. సుబ్బన్న శాస్త్రుల్లు కాస్సేపు నివ్వెరపడి చూసి, శివన్నకేసి చాలాసేపు చూడలేక వెళ్ళిపోయినాడు.

మరో క్షణంలో శివన్న శాస్త్రుల్లు భార్య ఆదరా బాదరా బయటికి పరుగెత్తుకొచ్చి, సమాధిలో కూర్చున్నట్టు అరుగుమీద కూర్చొని ఆకాశంలోకి చూస్తున్న భర్తతో, "ఇదేం విడ్డూరమండీ, ఇల్లంతా బియ్యమే! ఎక్కడ చూసినా మడమలోతు బియ్యం! బోలెడంత పాచిపని చేసుకోవాలిసుంది. ఎలాచచ్చేదీ? ఇది ఎవరు చేసిన పనంటూ!" అని చేతులు తిప్పసాగింది.

తన ఆలోచన సాగకుండా తన భార్యగా వ్యవహరిస్తున్న ఈ క్రిమి లబలబలాడటం శివన్న శాస్త్రుల్లుకు చిరాకు కలిగించి, "నా ఏడుపేమిటే, పిచ్చిముండా?" అని కేక వేశాడు.

మరుక్షణం సోమిదేవమ్మగారు బావురుమని పెద్ద పెట్టున్న ఏడుస్తూ, జుట్టు పీక్కుంటూ, మొహమంతా రక్కుకుంటూ, పళ్ళు కొరుక్కుంటూ, ఇంటి ఆవరణ మూవత్తూ చిందులుతొక్క నారంభించింది.

ఈ ఉపద్రవంతో శివన్న శాస్త్రుల్లు మైకం కాస్త వొదిలినట్టయింది. ఆయనకు భార్యవాలకం చూస్తే భయం వేసింది.

నటిస్తున్నదా అనుకున్నారు. కాని ఆవిడ అమాయకురాలు, మహాసాధ్వి, అల్లరిమనిషి ఎంతమాత్రమూ కాదు. తల్లిసితి చూసి పిల్లలంతా పెద్దపెట్టున ఏడవసాగారు ఒకమూల నుంచి ఊళ్ళోవున్న జనమంతా వింత చూడటానికి పోగవుతున్నారు. అందరూ తలో ప్రశ్న వేస్తున్నారు కొద్ది సేపట్లో శివన్నశాస్తుల్లు భార్యకు ఎవరో చేతబడి చేశారనీ, దయ్యం పట్టిందనీ, పిచ్చెత్తిందనీ, శివన్నశాస్తుల్లు ప్రొద్దున్నే లేచి పెళ్ళాన్ని కొడితే ఆవిడ నురుగులు కక్కుతుంటూ పడి పోయిందని, ఆవిణ్ణి కిందపెట్టారనీ రకరకాల వార్తలు గ్రామమంతటా వ్యాపించినై. మంచాల్లోపడి తీసుకుంటున్నవారు సయితం కాళ్ళీడ్చుకుంటూ, కర్రల సహాయంతోనూ, మరొకరిని ఆధారం చేసుకుని ఈ వింత చూడవచ్చారు.

భూతవైద్యు డొకాయన ఒకమూల ముగ్గువేస్తున్నాడు. వైద్యుడు రోగివాడి పరీక్షించి ఏమీ లేనందుకు ఆశ్చర్యపడుతున్నాడు. షుమారు రెండువందల యాభైమంది శివన్నశాస్తుల్లును ఒక్కసారిగా రెండువేల అయిదువందల ప్రశ్నలు వేస్తున్నారు. ఆయన ఎవరికని సమాధానం చెబుతాడు ? ఎవరికి చెప్పటానికైనా జరిగినదేమిటో తనకైనా అర్థమయితే కద ? ఈ అల్లరిలో "అమ్మోయ్ ! అమ్మా!" అని పిల్లల ఏడుపూ !

"ఊరుకోండ్రా ! మీ నోళ్ళు పడా !" అని శివన్న శాస్తుల్లు పిల్లల్ని కోప్పడ్డాడు. అంతటితో వాళ్ళ గోల అణిగింది.

కాని మిగిలినవాళ్ళింకా రణగొణధ్వని చేస్తూనే ఉన్నారు. అకస్మాత్తుగా శివన్నశాస్త్రులుకు ఆ జనంమీద చెప్పరాని రోత పుట్టింది. దోమలు, కొంకిపురుగులు !

"ఎందుకు మీరంతా ఇక్కడా ?" అని అరిచాడు శివన్న.

"అయ్యో పాపం, నీ భార్య అంత ఇక్కట్టులో ఉంటే—"

"నా భార్యకేం రోగంలేదు, మీకు ఏం రోగంలేదు ఎట్లా వచ్చినవారట్లా పొండి !" అని శివన్న గద్దించాడు.

వెంటనేసినిమాలోరివర్సు పాటులోలాగా వచ్చిన జనమంతా వెనక్కునడుచుకుంటూ ఎవరిళ్ళకు వారు వెళ్ళిపోయినారు. రకరకాల జబ్బులతో తీసుకుంటూవచ్చినవారికి, ఇంటికి పొయ్యేటప్పటికి రోగాలు నయమై ఉన్నై.

శివన్నశాస్త్రి భార్యా కూడా గారడీ చేసినట్టు మామూలు మనిషి ఐంది. ఆవిడ తడికళ్ళు ఆర్చుతూ, "ఏమిటండీ. ఏం జరిగిందీ ? నా మనస్సంతా గందరగోళముగా ఉందే ! ఏదాడర్రా, పిల్లలూ! చద్దన్నాలు పెట్టుకు తినండి నే నిల్లంతా బాగుచేసుకోవాలి... అయ్యో, అదేమిటర్రా ? అలా గుడ్లుపెట్టుకు చూస్తారేం ? కాస్త ఈ పిల్లల సంగతేమిటో చూడండి ! నాకు భయం వేస్తున్నదీ, పలకరేమర్రా ?" అని వాపోనసాగింది.

అసలే చికాకుగా వున్న శివన్న, "ఊరుకోవే! మీ అమ్మకు సమాధానం చెప్పరేంరా? చెప్పండి!" అన్నాడు.

"పెట్టుకు తింటామమ్మా!" అన్నారు పిల్లలు.

శివన్న శాస్త్రుల్లుకు నీరసం వచ్చేసింది. ఆయన కిప్పుడు ఏమీ ఆలోచించాలని లేదు. ఏమీ చెయ్యాలని లేదు. ఇదేదో తనకు దుర్దినం లాగుంది. నిద్ర లేచింది తను విన్న మాటకు గానీ చూసిన విషయాలకు గాని అర్థం లేదు. అంతు తాన్చుకోవ్ పడే ఓపిక కూడా లేదిప్పుడు. చాలా కాలం క్రితం తన తండ్రి పోయినప్పుడు తన మనస్థితి ఇలాగే ఉండింది. తనకు కూడా చచ్చిపోవాలనిపిస్తుంది. ఈ క్షణాన మైకం కమ్మి ఆ మైకం ఎప్పటికీ వదలకుండా ఉంటే బాగుండును. అప్పుడే మైకం వస్తున్నట్టే ఉంది — ఇవాళ లేచి తను విన్న అర్థం లేని మాటలు, చూచిన అర్థం లేని విషయాలు, విన్న మాటలు, చూసిన విషయాలు, తన్ను విన్న మాటలు, తను అన్న మాటలు —

కమ్ముకొస్తున్న మైకం అకస్మాత్తుగా వదిలింది. ఉదయం లేచింది లగాయతు తను అన్న మాటలన్నీ జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నించి విఫలుడైనాడు శివన్న శాస్త్రుల్లు ఆ మాటలకూ తను విని చూసినవాటికీ ఏదో సంబంధం ఉన్నట్టు ఆయనకు అనుమానం తట్టసాగింది.

"ఏమండీ శివన్న శాస్త్రుల్లుగారూ, మీ ఇంట్లోవాళ్ళ కేమో గాలిసోకిందీ చేసిందీ అని ఎవరో అన్నారు కాస్తనిం పా

దిగా ఉందా?" అని వీధినుంచి కేక వినిపించింది. శివన్న తల ఎత్తి చూస్తే కరణం. పొలానికి కామాలు పోతున్నాడు.

"ఏకేమైనా గాలి తగిలిందేమో, మావాళ్ళకేమీ లేదు !" అన్నాడు శివన్న.

మరుక్షణం కరణం గభీలున ఆ మట్టిరోడ్డుమీద చతికిలబడ్డాడు ఆయనకు పట్టరానంత పరాభవం అయింది. శివన్న తనను తృణీకరించి మాటాడటానికి తను ఎవర్లో తొసినట్టు పడటానికి ఏదో సంబంధం ఉందనుకున్నాడు కరణంగారు. కాని అది రుజువు చెయ్యటం ఎలా ? గుడ్డలు దులుపుకుని ఆయనదారిన ఆయన వెళ్ళాడు కరణంగారు

కాని ఇది చూసినతరువాత శివన్నకు సందేహం ఒకటి మనస్సులో రూపం దాల్చసాగింది. ఆయన ఎదురుగా వున్న అవిశిశెట్టుకేసి చూసి తన మనస్సులో, "ఈ చెట్టు విరిగి పడుగాక!"అనుకున్నాడు నిజంగా పడుతుందేమోనని గుండె దడదడ లాడుతున్నది. కాని చెట్టు చెక్కు చెదరకపోవటం చూసి మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నాడాయన. కాని ఆ ధైర్యం వెంటే మరో సందేహంకూడా కలిగింది దాన్నిరహితం చేసుకోనటానికి గాను బిగ్గరగా, "విరిగి పడవే అవిశి ముండా !" అన్నాడు. మరుక్షణం పది అడుగుల ఎత్తు పెరిగిన ఆ అవిశిశెట్టు పెళ్ళున విరిగి పడింది

శివన్నకు ముచ్చెమటలు పోసినై. తనకెవరో శాపం పెట్టారు. తన నోటివెంట వచ్చిందల్లా నిజమవుతున్నది. తను ఇక నోరు కట్టేసుకోవాలి. ఆయన గబగబా లోపలికి

పోయి భార్యను సమీపించి, "ఒసే నేనొక నెలదాకా మౌనవ్రతం పట్టబోతున్నాను. నాతో ఎవరూ మాట్లాడ వద్దు. నన్ను పలకరించటానికి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యవద్దు. మనింటికి వచ్చినవారికి కూడా గట్టిగా చెప్పు!" అన్నాడు. అటువంటిదేదో చేస్తేతప్ప తన జీవితం దుఃఖ భాజనమైపోతుంది. ఒక్క జామునేపట్లోనే ఇంత అల్లరి అయితే జీవితమంతా ఎలా గడపటం?

"మౌనవ్రత మేమిటండీ, ఎక్కడోసూ? ఎప్పట్నించి పడతారూ?" అన్నది భార్య

"ఇప్పటినుంచే!"

అంతే, మరి శివన్న నోరు తెరవలేదు.

## 3

"చమత్కారం చిత్తగించారా? అన్నాడు నారదుడు బ్రహ్మతో. శివన్న శాస్త్రులు, సరస్వతీ వరప్రసాదం జాసి అయి మౌనవ్రతం పట్టాడు. అయ్యవారిని చెయ్యబోతే కోతి అయిందన్నట్టు, మనిషిని దేవత చెయ్యబోతే పశువై ఊరు కున్నాడు!"

"ఈ అపహాస్యం నాకు నచ్చటంలేదు నీన్ని వెంటనే ఉపసంహరించే సదుపాయం చేద్దూ!" అన్నాడు బ్రహ్మ

"మీరలా తొందరపడకండి. ఇది అపహాస్యమని మనం అనుకుంటే కాదు, తల్లిగారికి తెలిసిరావాలి...!"

నారదుడు సరస్వతీదేవి దగ్గిరికిపోయి, "అమ్మా, వ్యవహారం వికటించింది. ఆ బ్రాహ్మణుకాస్తా మౌనవ్రతం పట్టాడు. దేవతను చెయ్యబోతే పశువైనాడని తండ్రిగారు నవ్వుతున్నారు!" అన్నాడు.

"ఆ బ్రాహ్మణ్ణి మౌనవ్రతం వెంటనే మానెయ్యమను. ఎక్కడో పొరపాటు జరిగినట్టున్నాడు!" అన్నది సరస్వతి.

"అసంభవం. ఈ నెలరోజులూ చెల్లేలోపల అతను కావాలన్నా మాట్లాడలేడు. అతని నోటివెంట వచ్చిన మాట——"

"నాకు తెలుసు, నాకు తెలుసు!" అన్నది సరస్వతి ఆదుర్దాగా, అటూ ఇటూ పచారుచేస్తూ. "ఈ నెలా అయిన తరువాత అతని మనస్తత్వం మారితీరాలి. మనం ఇచ్చిన వరాన్ని అతను వుపయోగించాలి."

"దుర్వినియోగపరిస్తే?"

"పరవలేదు! ముందు దుర్వినియోగ పరిచిగాని సద్వినియోగం జాడ తెలుసుకోలేడు ఎలాగూ."

"మహా చిత్రం!" అన్నాడు నారదుడు.

"విషయం ఇంతదూరం వచ్చిన తరువాత నీళ్ళు నములకు!" అన్నది సరస్వతి విసుగ్గా.

# 4

మౌనవ్రతంతో మొహం మొత్తిపోయింది శివన్నకు. ఈ నెలలోపల అతనికి అనేక పర్యాయాలు తన వాక్కుతో అవసరం కలిగింది—వాక్ప్రభావంతో కూడా అవసరం గలిగింది. కాని అది తన అందుబాటులో లేకుండా తానే చేసుకున్నాడు పెట్టెలో బోలెడంత ధనం పెట్టుకుని తాళంచెవి పారేసుకుని దారిద్రం అనుభవించేవాడి సామెత అయింది శివన్నకు. పైగా మౌనంగా వుండవలసిరావటం అతని బుద్ధికి ఎన్నో లక్షల ఆలోచనలో తెచ్చి పెట్టింది. తన భావి కర్తవ్యమంతా నిర్ధారణ చేసుకున్నాడు శివన్న. తన కొత్త శక్తిని సమగ్రంగా ఉపయోగించుకునే మనోబలం, మౌనకాలంలో సాధించాడు.

వాక్కు లభ్యమైన మరుక్షణం శివన్న అదృశ్యమైపోయినాడు. అతను తనకు ఊరూనామా లేకుండా చేసుకున్నాడు. తానే భగవంతుడు తన ఉనికి ప్రపంచం. తనే శక్తిస్వరూపుడు. బ్రహ్మసృష్టి యావత్తూ తన వాక్కుకు బానిస. మామూలు సంపర్కాల—తన ఇల్లూ వాకిలీ భార్యాబిడ్డలూ, కులమూ-గోత్రమూ విసర్జించేశాడు. శివన్న తన ఆకారం మార్చుకున్నాడు. అత్యున్నతమైన తన ఆకారం ధరించాడు. తనకోసం రకరకాల గృహాలు, విహార స్థలాలు నిర్మించాడు. తనకు పరివారంగాని, నౌకర్లుగాని,

భృత్యులుగాని, స్నేహితులుగాని, చుట్టాలుగాని, విరోధులుగాని—ఎవ్వరూ అవసరం లేదు. తనను సక్రమమైన కోరికలు ఆహార నిద్రాదులు అవసరం లేకుండా చేసుకున్నాడు.

ఆ స్థితి వచ్చిన తరువాత తనకు శరీరంతోనూ, కాలంతోనూ, స్థలంతోనూ అవసరం లేకుండా పోయింది. అతని బుద్ధి లీలలమీదుగా పోసాగింది. కొండలు చదును చెయ్యాలనిపించింది నదుల్ని ఎండబెట్టా లనిపించింది. మేఘాలను భూమిమీద పాకించా లనిపించింది. ఎందుకంటే ఏమీ లేదు-లీల. "నేనూ లీలామానుష విగ్రహుణ్ణి, పరమాత్మను!" అనుకున్నాడు శివన్న.

ఇదివరకల్లా తను వేటికి వెరిచాడో — భయమూ, అవమానమూ, చావూ, భీభత్సమూ—వాటన్నిటినీ ఇతరుల మీద ప్రయోగించాలని శివన్నకు పుట్టింది. ఒక్కొక్క దేశం అకస్మాత్తుగా మహార్ణవమైపోతుంటే అందులో వున్న జనం భీభత్సంగా కేకలువేసి నీటిలోపడి చచ్చిపోతుంటే శివన్నకు చూడబుద్ధి అయింది. అది ఆనందంకూడా కాదు, పగ అసలే కాదు, అదొక అనుభవం. అతని మనస్సు ఆప్యాయంగా స్వీకరించే అనుభవం.

సూర్య చంద్రాదులు గతులుతప్పి అర్థంలేని నడక నడుస్తున్నారు. అసలు ప్రకృతే క్రమం తప్పింది. ఏ ప్రకృతి క్రమాన్ని తెలుసుకోవటానికి శాస్త్రజ్ఞులు జీవితాలను జీవితాలు ధారపోశారో, ఏ ప్రకృతి విన్యాసాలతో సౌందర్య పిపాసులు రససిద్ధి పొందారో, ఆ ప్రకృతి క్రమవిన్యాసాలు,

శివన్నకు మొదట ఆహుతి అయినై వాటిమీద మానవుడికి ఏమూలనైనా పగవున్నదేమో! శివన్నలో అణిగివున్న ఆ పగే ఇప్పుడవకాశం దొరికి పైకి వచ్చిందేమో! మానవ జాతిని సక్రమపరిణామానికి దూరం చేస్తున్నది. ఇటువంటి ఇంపల్సేనేమో. ఎక్కాలపుస్తకం అబద్ధం చెయ్యటంలో శివన్నకు పరితుష్టి లభించిందంటే దాన్నిబట్టి మనం అంతకంటె ఏం గ్రహించగలం?.

మన మామూలు అభిప్రాయాల ప్రకారం శివన్న ఉన్మత్తుడు: అతని దెబ్బ రుచిచూసినవారంతా ఉన్మత్తులైనారు. అతన్ని ఒక కొత్త శక్తిగా గుర్తించినవారు కూడా ఆ శక్తిని భగవంతుడుగా భావించి ఆరాధించారు. అతన్ని చూసినవారు లేరు. చూశామన్న వారిలోకూడా ఒకరితో ఒకరు ఏకీభవించలేరు; పైపెచ్చు పరస్పరం కలహించుకో సాగారు.

అనేకమంది అనేకరకాల అతని స్వరూపాన్ని చిత్రించారు. అందులో రెండుమూడు రకాల చిత్రాలకు ప్రచారం కూడా జాస్తిగా వచ్చింది. ఈ కొత్త భగవంతుడి స్వరూపం గురించి పోట్లాడుకునేవాళ్ళు పోట్లాడుకుంటూ ఉంటే, మరికొందరు ఆ వివిధ స్వరూపాలన్ని యదార్థమైనవే, ఆదిశక్తి ఒక నియామక స్వరూప మేమిటని కొందరు వేదాంతులు సర్దారు. తనని గురించి ప్రజాభిప్రాయం ఏమిటో ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్న శివన్న తన ఏదో స్వరూ

పాలు బహుజనాదరణ పొందినవో వాటిని ధరించి అక్క-డక్క-డా సాక్షాత్కారం ఇవ్వసాగాడు ప్రజలకు.

ఈ భీభత్సయుగంలో యుగధర్మాన్ని అనుసరించి ఒక కొత్త మనస్తత్వం ఏర్పడ్డది ప్రజలకి. ఆ మనస్తత్వం ప్రకారం తను భగవంతుడిలో ఒక క్రమం వుందని తెలుసుకున్నారు ఆ క్రమాన్ని తన భక్తులద్వారా శివన్నకూడా తెలుసుకున్నాడు. అప్రయత్నంగా శివన్న ఆ క్రమాన్ని అనుసరించి ప్రవర్తించసాగాడు. తన ఉత్కృష్టతను తృణీకరించినవాడు మరుక్షణం భయంకరమైన చావుచచ్చి, భస్మీపటలం అయిపోవలసిందే. తనను నమ్మినవాడు బాగుపడవలసిందే.

పాతక్రమం పోయిందేగాని కొత్తక్రమం వచ్చిందని శివన్న తెలుసుకోలేదు. ఈకొత్తక్రమాన్ని తనకు క్రమంగా అలవాటు చేసింది భక్తులే. తన ప్రబల విరోధులంతా చచ్చిపోయినారు. ఇక ప్రపంచంలో తనని ఏదోవిధంగా ఆరాధించనివాడు లేడు. రూపభేదాలతో, నామభేదాలతో అందరూ తననే ఆరాధిస్తున్నారు. తనేగా సర్వశక్తి. వాళ్ళు దేన్ని ఆరాధించినా అది తనే అవుతున్నాడు. తను క్రమం తప్పి ప్రవర్తించినప్పుడు తన భక్తులు కొందరు ఏడుస్తున్నారు; మరికొందరు తనని నిందించి లేడంటున్నారు. రెండూ తనకు కష్టంగానే ఉన్నై.

మానవులందరూ చిన్న చిన్న కష్టాలకూ సుఖాలకూ లోనుగావటం పైనుంచి చూసేటం శివన్న కింపుగా

వుంది. కాని వారి కష్టసుఖాలు తన కంటకపోవటం—తన ఏకాకిత్వం—మాత్రం అతనికి రుచించ లేదు. అప్పుడప్పుడు తానుకూడా తిరగాలనిపించేది, తిరిగేవాడు. ఎవరికో ఒకరికి కనిపించి "నేను భగవంతుణ్ణి!" అనేవాడు. తన దర్శనం దొరికినవాడు పొందే పారవశ్యం చూస్తే తనకు కళ్ళనిళ్ళ పర్యంతమయ్యేది. తనకంటె తన భక్తుడెంత ధన్యజీవి అని పించేది.

మరికొంతకాలానికి శివన్నకు తన దేవత్వంతో ముఖ మొత్తింది. అతను తనవాక్శక్తిని ఉపయోగించి చాలా కాల మయింది. తన భక్తులమీద ప్రత్యేక దృష్టి వుంచి వారిని ఒక కంట కనిపెట్టి ఉండటం కూడా అతనికి విసుగెత్తింది. అందులో చాలామంది తనను స్మరించుతూ కూడా పూర్తిగా మరిచారు. వారికి కావలసింది వారి దైనిక అనుభవం— తన సాన్నిధ్యం కాదు. అలవాటు చొప్పున వారు నిర్లిప్తులై నిత్యం తన నామం—వారు పెట్టిన నామం — స్మరిస్తారు. కాని వారి హృదయాలూ, మనస్సులూ తమ తీరు చిన్న చిన్న కష్టాల మీదా బుల్లి బుల్లి సుఖాలమీదా లగ్నమై ఉన్నై.

తనతో వారికి పని అయిపోయింది! తనతో తనకే పని అయిపోయింది!

## 5

"వాళ్ళ పడవ ఇంకో దరి పట్టింది. మనం మళ్ళీ ఓడి పోయినాం !" అన్నాడు నారదుడు సరస్వతితో.

"అతన్ని మళ్ళీ రెచ్చగొట్టి చూడు !" అన్నది సరస్వతి

## 6

"ఏం దేవరా, తమ దేవత్వం ఎట్లా సాగుతున్నది?" అన్నాడు నారదుడు, శివన్నను సమీపించి.

"దేవుడు చేసేదేమీ లేదు. దేవుడైనవాడు ఏమీ చెయ్యకుండా ఉండటం కంటె చెయ్యదగిందిలేదు!" అన్నాడు శివన్న.

"నీకు పోటీ తగలబోతున్నది. ఇవాళో రేపో, నీకు సంప్రాప్తమైన వాళ్ళశక్తే నీ భార్యకు కూడా కలగబోతున్నది" అన్నాడు నారదుడు.

"నా భార్యా ? ఏం చేస్తుంది వాక్శక్తితో ?"

"నువ్వు చేసిన పనే !"

"వద్దు ! వద్దు ! అమాయకుల జీవితాలను నా

భార్య అకారణంగా ధ్వంసం చేస్తుంది. వాళ్ళ కష్టాలూ, సుఖాలూ వాళ్ళకెంత ఇష్టమో దానికి తెలీదు !" అని శివన్న వాపోసాగాడు.

"మీ రిద్దరూ మీ శక్తి సామర్థ్యాలు ఒకరిమీద ఒకరు చూపరాదూ ?"

శివన్న తల అడ్డంగా ఊపాడు "శక్తి సామర్థ్యాలు తెలిసిపోయిన తరువాత వాటిల్లో ఆనందమేమున్నది ?"

## 7

"ఏం నారదా? మానవకోటి కంతకూ అమోఘ వచనం ఇవ్వటం విషయం ఏం నిర్ణయించారు.?" అన్నాడు బ్రహ్మ.

"మొదటి గృహీతను మోహం మొత్తింది!" అన్నాడు నారదుడు.

"మీ తల్లిగారికో?" అన్నాడు బ్రహ్మ సరస్వతికేసి పక్కచూపుగా చూస్తూ.

సరస్వతి తలవిసిరి చరచరా వెళ్ళిపోయింది.

బ్రహ్మ బిగ్గరగా నవ్వసాగాడు.

# ధర్మ సందేహం

ప్రమాణ పూర్తిగా అంతకన్న ఏమీ జరగలేదు.

"కాస్త పలహారం చేద్దువుగాని లేవరా!" అని వాళ్ళమ్మ అంటూనేవుంది. ఏదో ఆలోచిస్తూ పడుకున్న వాడల్లా చివాలున లేచాడు. కోటు వేసుకున్నాడు. బయట వున్న తన పుస్తకాలూ, కాగితాలూ, కలమూ, రెండు చొక్కాలూ, తువాలూ గబగబా పెట్టెలో అడ్డదిడ్డంగా పడేసి పెట్టెమూసేశాడు. కాళ్ళకు చెప్పులు తగిలించు కున్నాడు పెట్టె చేతపట్టుకున్నాడు. "నే పోతున్నా" అన్నాడు.

ఎక్కడికిరా, అంటే చెప్పలేదు. ఎందుకురా, అంటే చెప్పలేదు.

శివయ్యకు కోపంవచ్చింది. రాదూ? అడ్డంవెళ్ళి, "నీ వేషాలు—నాకెప్పుడూ అర్థం కాలేదనుకో—ఇప్పుడసలే అర్థం కావటంలేదు." అని పలకరించబోయినాడు.

"నాదారికి అడ్డంలే!" అన్నాడు జానకిరాముడు.

అంతే. వెళ్ళిపోయినాడు. మళ్ళీ తిరిగిరాలేదు. తిరిగి వచ్చేవాడైతే అట్లా దేనికి వెళతాడూ?

చేతికొచ్చిన కొడుకు. లా చదవకపోతే మానె, ప్రాక్టీసు పెట్టకపోతే మానె, బియ్యే చదివాడుగా? నాలుగు రాళ్ళు తెచ్చుకోగల సమర్థత వున్నవాడేగా?

తనకోసం కాకపోతే మానె—పెళ్ళాం. పెటాకులా? నిక్షేపమల్లే వాడి ఈడువాళ్ళంతా బిడ్డల తండ్రులై కూర్చున్నారు! తండ్రికోసమైనా ఒక ఉద్యోగమంటూ అఘోరించి పుత్రధర్మంగానైనా, తండ్రిమీది బరువు తగ్గించినవాడు కావచ్చుగా!

తన తండ్రి ప్లీడరు గుమాస్తాగిరీ చేసి కాపరం గడుపుతున్నాడంటే తనకు మాత్రం ఏం ఘనం?

అన్నిటికి ఏదో ఒకటి చెబుతాడు. ఉద్యోగాలెక్కడ ఉన్నయ్యంటాడు. శివయ్య మూడోఫారం పాసుకాలా. ఏడాది వాలంటీరు చేసి అయిదురూపాయలమీద ప్లీడరు గుమాస్తా అయినాడు. జానకిరాముడి పుటకలప్పటిమాట. మరి ఆ చేత్తోనే ముప్ఫైవేలు చేసే ఆస్తి సంపాదించాడా? డబ్బు మనదగ్గిరికెప్పుడన్నా వస్తుందా? మనం దానిదగ్గిరికెళ్ళాలిగాని!

అయినా, వాడికి పుత్రధర్మమేమిటి? నాస్తికుడైతే. తద్దినాలేమిటంటాడు. కొలుపు లేమిటంటాడు. పూజలేమిటంటాడు. జాతకాలేమిటంటాడు "ఏ రేశలింగంగారు చచ్చిన ఇన్నేళ్ళకి నాచుట్టూతా ఈ మూఢాచారాలేమిటి" అంటాడు.

దొరికాడు వెధవముండల పెళ్ళిళ్ళపంతులు—ప్రతిదానికి మూఢాచారమే? పనిమీద పొయ్యేవాడు, వొంటిబ్రాహ్మ డెదురైనాడనో, తుమ్మారనో కూర్చుంటే, అది మూఢాచారమా? పొద్దున్నే లేచింది లగాయతు ఎన్నోపాపాలు చేస్తాం, ఎన్నో అబద్ధా లాడతాం, ఎంతమందినో టోపీ వేస్తాం, రాత్రికి పడుకోబొయ్యే సమయానికి కాస్త 'రామా కృష్ణా' అనుకుంటే, దానమ్మ కడుపుకాలా, అదీ మహా పాతకమేనా? ఇదేనా చదువు సంధ్యలు నేర్పేది?......

## 2

శివయ్యకు నిజంగా పట్టుకున్నది ఇవేవీ కావు. జానకి రాము డిల్లు వొదిలి ఎందుకు పోయినట్టు ?

ఒకపోట్లాట జరగలేదు; వాగ్వాదమన్నా జరగలేదు.

వాడికేవేవో మనస్సులో ఉన్నమాట నిజమే—కాని అవి ఈనాటివి కావుగా ?

అసలు వాడికా ఇంటిమీదే పగ. "కట్టారు ఇల్లు ప్రతి దర్వాజాలో నుంచి వొంగి పోవలసిందే మరో ఉరేసి అంగుళాలు పెట్టుకుంటే ఏంపోయింది ? ఇల్లు మొత్తంమీద ఈ పొట్టి గుమ్మాలు పెట్టి పది రూపాయలన్నా ఆదా చేశారో లేదో, పాపం !" అని సణిగేవాడు.

తను చెమటోడ్చి ఒక్కొక్క రూపాయే కూడబెట్టి పోగుచేసి ఎన్నో ఏళ్ళ ప్రయత్నంతో ముచ్చటపడి కట్టించిన ఈ ఇంటికి, దర్వాజాలు మరో అంగుళం పెట్టలేదని, రోజూ తన కొడుకు సణుగుతూ వుంటే శివయ్యగారి ప్రాణం ఎంత క్షోభ పడాలి. క్షోభ పడలా?... వీడు ఆరడుగులు పెరుగుతాడని ఆ యిల్లు కట్టిన వారెవరన్నా కలగన్నారా ?...

అదేం ఖర్మమో, ఆ తండ్రీ కొడుకు లిద్దరిక్కీ ప్రతి దాన్లోనూ ఎదురుముల్లే. శివయ్యగారు ఎంత సదుద్దేశంతో ఏది చెప్పినా, జానకిరాముడు దానికొక దురుద్దేశం అంటగడతాయె.

"నీ జన్మల్లా ప్లీడరు గుమాస్తాగిరీలో గడిపావు. ప్లీడరు పని చెయ్యాలనే నీ మోజు నా ద్వారా తప్ప తీర్చుకునేటందుకు లేదు. అందుచేత నన్ను ప్లీడరు కమ్మంటున్నావు……అవును, ప్లీడర్లకి ఏమీ రావటం లేదని నీకు తెలుసు, నీ ప్లీడరుగారు సంపాదించింది నీ తెలివితేటలవల్లనే అని నీనమ్మకం. నీ తోడుంటే నేను లక్షలు సంపాదిస్తానని నీ ఆశ ! నిజంగా నీ మూలంగానే మీ ప్లీడరుగారు వేలకువేలు సంపాదిస్తే నువ్వాయన దగ్గిర నలభై రూపాయలతో ఎందుకు తృప్తిపడ్డావు ? నీ అసలు సంపాదనంతా క్లయింట్లను దోచి ఎందుకు సంపాదించావు ?"

"ఏమిటీ మాటలు ? మాటా మర్యాదా తెలిసిన తెలిసినవాడు అనేవేనా ?

అసలు వాడికి పెద్దంతరం, చిన్నంతరమంటూ ఉందా"

"రోజూ పాపాలు చేస్తున్నామని తెలుసుండి ఆ పాపాలు చెయ్యకపోతే ఏం ?" అని వాడు తండ్రి నడగలా?

3

వాడెందుకు వెళ్ళినట్టు ?"

ఈ ప్రశ్నకి సమాధానం దొరక్కపోవటం శివయ్య గారికి వింతగా ఉంది.

వెడితే వెళ్ళాడు. బలవంతాన ఇంట్లో ఉంచుతారా ఏమిటి ? పాతికేళ్ళు పైబడ్డవాణ్ణి.

వాడు జంఝం లాగిపారెయ్యటం ఈ ఇంట్లోనే అయిపోయింది. తనను అనవలసిన మాటలన్నీ అనటం అయిపోయింది. "నీ సంపాదనలో నుంచి నా కొక్క దమ్మిడీ అక్కర్లేదనటం అయింది. చాలాకాలం కిందటే అచ్చుపోసి విడిచేశారు. ఇప్పుడకస్మాత్తుగా ఏమి వచ్చిందని లేచిపోయినట్టు ?

రోజూ భోజనం వేళకు ఇంటికి వస్తాడు. ఎక్కడికో వెడతాడు. ఎవరెవరో వచ్చి పిలుచుకుపోతారు. ఏమేమి విషయాలో మాట్లాడతారు. ఇహానికీ, పరానికీ చెందిన విషయాలు కావు. ఒక డబ్బు విషయం కాదు, ఒక కోర్టు వ్యవహారం కాదు, ఒక కుటుంబ వ్యవహారం కాదు. ఎవరూ

లేకుండా ఇంట్లో కూచుని ఏదో శాస్త్రాలు బ్రహ్మాస్తాత. అవంతా పత్రికలకి పంపిస్తాడు గామాలు. చిన్నవాడు చెప్పు చెప్పుతూ, "నాన్నా, అన్నయ్య రాసింది అచ్చుపడ్డది చూశావా ? అంటాడు.

ఏముంటుంది చూడటానికి ? బూడిద ! పిరికితనమని ఉంటుంది ! జంఝాలు తెంచమని ఉంటుంది ! అన్నమంతా పట్టిమాడాలీ ? అబ్బాయి వాలకం అర్థమవుతూనే ఉందిగా !

ఇదంతా జరిగిపోతూనే వుందిగా? ఇప్పుడు వీడెందుకు ఇల్లువిడిచి దిక్కులేని పక్షి అయి, వెళ్ళిపోవాలి?...

శివయ్యగారు తనమీద దోషారోపణ చేసుకోవలసిన అవసరం ఏమీ లేదు. కాని కొడుకు లేచిపోవటానికి తప్పు తన దే అని ఎవరో అన్నట్టుగా ఆయన బాధపడ్డాడు. వాడు, "నీమూలంగానే నేను ఈకొంపలోంచి బయటికి పోతున్నా" అంటే ఎంత సిగ్గుపడాలో అంతగా ఆయన మనస్సు గింజుకుంటున్నది.

ఆ కారణం తెలిస్తే బాగుండును. అప్పుడుగాని ఈ గుంజాటన అంతంకాదు. ఆ కారణంకోసం ఆయన మనస్సు ఆనాటి—జానకిరాముడు వెళ్ళిపోయిననాటి—సంఘటనని సినిమాచిత్రం మళ్ళీ మళ్ళీ వేసి చూసుకున్నట్టు చూసుకుంటున్నది.

వెనక ఒకసారి—పదేళ్ళ క్రితం—చిన్న సంఘటన జరిగింది. శివయ్యగారు బజార్లో అయిదురూపాయల కాగితం పారేసుకున్నాడు. అది పోయిందని చూసుకున్న చోట

రోడ్డు ఝూముసేపు వెతికాడు. కాగితం దొరకలేదు. ఆయనే కాదు. ఇంకా యాభైమంది కలిసి వెతికారు.

"ఇంకెక్కడన్నా పారేసుకున్నారేమో?" అని ప్రతి వెధవా అనేవాడు. చివరి కాయనకి కోపంకూడా వచ్చింది.

"ఇంతవరకూ చేతిలోనే వుంది. ఇప్పుడే పోయింది. ఇక్కడే చూసుకున్నా" అంటుండాయన.

కాగితం పోయిందని రూఢి అయినాక ఆయనకు, వట్టి పుణ్యానికి ఐదురూపాయలు పోయాయన్న విచారంకన్న తన పెద్దకొడుకు—అంటే ఈ జానకిరాముడే—ఆ పొద్దునే తనను ఐదురూపాయ లడిగి లేదంటే లేదనిపి చినందులకు కోపం ఎత్తుకొచ్చింది. ఆ వెధవ తనచేత అన్నిసార్లు ఐదు రూపాయలు లేదనిపించకపోతే ఈ కాగితం ముక్క పోక పోను... వెధవ తథాస్తు దేవతలు!...

అట్లాగే ఇప్పుడు...

ఈ విషయం ఎందుకు చెప్పొచ్చానో మరిచాను. పోనివ్వండి...

# 4

రెండోవాడున్నాడే .. సూర్యం — వీడు వాడి మాదిరేకాదు. అసలు మొదటినుంచీ వీడితరహాయే వేరు. వీడిదగ్గిర దాపరికం లేదు. స్పష్టంగా మనసులో వున్నది చెప్పేస్తాడు.

"ఇదుగో, నాన్నా! నువు నన్ను లా చదవమంటున్నావు. నువు చెప్పినట్లు వినడం నా ధర్మం. నేను చదువుతాను. నాకేమీ అభ్యంతరం లేదు. నీ ముచ్చట తీర్చటం కంటే నాకు కావలసిందేమిటి? కాని నేను ప్రాక్టీసు చేసి పైకొచ్చి ఫలానావాడి పిల్లవాణ్ణి అనిపించుకోగలనని నాకు నమ్మకం లేదు. నువు ప్లీడరు గుమాస్తా చేశావంటే మీ ప్లీడరుగారి కున్నంత పేరు నీకూ వుంది. ఆయన సంపాదించినంతా నువూ సంపాదించావు. రేపు నలుగురూ నన్ను చూసి ఫలానా శివయ్యగారి కుర్రాడేనా ఈ ప్రాక్టీసులేని ప్లీడరు, అంటే నీ మనస్సెట్లా వుంటుందో ఆలోచించు. ప్లీడరీ చెయ్యటానికి కాస్త ఆరితేరినవాడై ఉండాలని నీకు తెలుసు కదా! నన్ను నలుగురిచేతా బుద్ధిమంతుడు, అమాయకుడనిపించుకునేటట్లు పెంచావు. లాయరుపేచీలు నావల్ల కావు. ఆలోచించు. నువు చదవమంటే లా చదివేస్తాను. ఫస్టు క్లాసులో కూడా పాసయిపోతాను. బియ్యే పాసయినవాడికి లా ఒక లెఖ్ఖా?" అని స్పష్టంగా చెప్పేశాడు.

నిజానికి వాడు చెప్పిందాన్లో అబద్ధం యేమీ లేదు. పెళ్ళివిషయంలో కూడా వాడు అట్లాగే చెప్పేశాడు.

"ఇదుగో, నాన్నా! నాకు పెళ్ళిచెయ్యాలను కుంటే మహారాజుగా చేసెయ్యి. కాని, ఇప్పుడు పెళ్ళిళ్ళు వెనకటి లాగా లేవు. ఈ శారదా బిల్లొచ్చినాక పెద్దపిల్లలై పెళ్ళాళ్ళవు తున్నారే, వీళ్ళు మొగుళ్ళ చూసుకొని ఇష్టపడటమూను, పడకపోవటమూ నేర్చుకుంటున్నారు. ఒకవేళ పెద్దవాళ్ళకి ఎదురాడక వాళ్ళు అంటగట్టిన మొగుణ్ణి చేసుకుంటున్నా లోపల, వీణ్ణినాకు అంటగట్టారే, అన్న పగ పెట్టుకుంటు న్నారు. ఇటువంటి పెళ్ళిళ్ళు లేకుండానే వుండాలిగాని ఉన్నాక మొగుడు పెళ్లాళ్ళు ఒకరి మనస్సులొకళ్లు తెలుసు కుని చేసుకోవటమే మంచిది. ఏమీ ఎరగనప్పుడు చేసేసిన మీ కాలపు పెళ్ళిళ్లే మేలు. అవిపోయాక ఎవళ్ళకివాళ్లు చూసుకునే సంబంధాలు నయంగాని ఈ మధ్యరకపు పెళ్ళిళ్ళు అందునా ఇందునా కాకుండా అఘోరిస్తాయి. నేచెప్పింది అవునంటావా, కాదంటావా!"

అందులో అబద్ధమేముందీ?

"ఎక్కడ చూసినా బియ్యేలే నాన్నా. రూపాయికి, పదిమంది దొరుక్కుతున్నారు. ఏం ఉద్యోగం పోసస్తూ ? ఉద్యోగం లేకపోతే మనకేం జరగదు గనకనా? నాక్కూడా అన్నయ్యలాగే కథలు రాద్దామని ఉంది,నవలలు రాద్దామని ఉంది, నాటకాలు రాస్తాను కూడాను. రెండు కథలు రాసి పత్రికలకు పంపా. పడతాయి. నువ్వే చూద్దువు గానిగా ? నే చెప్పేదీ, చాతనయిన పని చెయ్యటంలోనే

నిజమైన కీర్తి వుంది. ఎందరు ప్లీడరు గుమాస్తా పని చేయ లేదు. ఏదీ ? నీ కొచ్చిన పేరందరికీ రాలేదేం ?" అన్నాడు సూర్యం.

5

నేనొక సంధ్య చుట్టపుచూపుగా శివయ్యగారింటికి వెళ్ళాను

కుశల ప్రశ్న లయినాక మాటల సందర్భంలో ఆయ నతో, "ఏం, బావగారూ ? పిల్లలిద్దర్నీ సాహిత్యంలో దిం చారే ?" అన్నా.

"వాళ్ళ మొహం !....నిన్ను చూసే చెడిపోయి ఉం టారు... సరేకాని మా సూర్యం ఏమన్నా బాగా రాస్తాడా" అన్నా డాయన

"బాగానే రాస్తే. ధోరణి ఉంది. కాని పెద్దవాడికి చాలదేమో. ఎక్కువ మందిని ఆకర్షించేది చిన్నవాడి కథలే గాని మీ జానకిరాముడి రాతలో లోతు జాస్తి అనిపించింది నాకు" అన్నాను.

"నే నివేవీ చదవనులే ... అయినా నన్నడిగితే ఏ పనిలో కూడా, చూస్తున్నాగా, పెద్దవాడికన్న సూర్యానికే చాకచక్యం జాస్తి," అన్నాడు శివయ్యగారు.

అందామా వద్దా అని కాస్సేపు సస్తాయించి ఆఖరుకు అనేశా !

“చూడండి, బావగారూ. మీరు చదవరు కనుక తెలీదుగాని, మీ పిల్లలిద్దరూ మిమ్మల్ని కథలోకి ఎక్కించేశారు.”

“నన్నే ? నన్నే ?” అన్నారు శివయ్యగారు కంగారుగా.

“అవును. అదిగాదు నే చెప్పవచ్చింది. మీ సూర్యం మిమ్మల్ని చాలా అపహాస్యం పాలుచేసి కథ రాశాడు. మీ పెద్దవాడి కథలో —”

నా మాట శివయ్య పూర్తికానివ్వలేదు.

“వాడెందుకు ఇల్లు వొదిలి వెళ్ళిపోయినాడో నా కర్థం కాలేదు. ఎంతో ఆలోచించా. ఇంట్లో వుంటే వాడికేమి నష్టం వచ్చింది ?”

“ఉంటే వాడు కూడా మీ సూర్యం రాసినట్టే రాసేవాడేమో !” అన్నా. నా కింకేమీ అనటానికి తోచలా, చెప్పొద్దూ.

శివయ్యగారు అర్థంకాని చూపులతో నాకేసి అట్లాగే చూశాడు.

# బాహుకుడు

పదేళ్ళ క్రితం సీతారామయ్యను గురించి విసుగు లేకుండా చేసిన ప్రచారం జ్ఞాపకంవస్తే నాకిప్పుడు చాలా సిగ్గుగా ఉంటుంది. ఈ మధ్యనే ఆ విషయం నా కెవరో జ్ఞాపకం చేశారు. అతన్ని గురించిన ప్రసంగం వచ్చేసరికి "వాడి సంగతి నాకు చెప్పకండి" అన్నాను. "ఇతన్ని ఒకప్పుడు ఊరేగించినవాడివి కావూ?" అని దెప్పిపొడిచారు.

అవును, సీతారామయ్యను ఊరేగించాను. ప్రపంచంలో ప్రతిభావంతులు చాలా అరుదు. రెండురకాలవాళ్లు ప్రతిభావంతులను గురించి ప్రత్యేక శ్రద్ధ ప్రకటించరు — ప్రతిభ గుర్తించలేనివాళ్లు నిజంగా ప్రతిభకలవాళ్ళూనూ. దురదృష్టవశాత్తూ నాకు ప్రతిభ గుర్తించే శక్తిమటుకే ఉంది, ప్రతిభ లేదు.

సీతారామయ్య చక్కగా సంగీతం పాడేవాడు. ఇప్పుడింకా బాగా పాడుతున్నాడేమో కూడాను. అయితే నే

నతని సంగీతం చూసి ముగ్ధుణ్ని కాలేదు. నాకు సంగీతం గురించి తెలిక కాదు. నను ముగ్ధుణ్ని చెయ్యటానికి కా సంగీతం సరిపోలేదేమో అనుకుంటాను. ఏమైనా అతని సంగీతం గురించి నే నెప్పుడూ తాపత్రయపడలేదు. నన్ను బలంగా ఆకర్షించింది, అతనిలో సమగ్రంగా ఉన్న మానవత్వం.

మానవత్వానికి సంఘంలో పలుకుబడి లేదు. ఎన్నడూ ఒక నీచమైన భావం ప్రకటించని వాణ్ణి, తన బరువు ఆవగింజంతైనా, పొరపాటునకూడా ఇతరులమీద వెయ్యని వాణ్ణి, తన మనోవికారాలను ఏమాత్రమూ ప్రదర్శించని వాణ్ణి నలుగురిలో ఉన్నప్పుడు సమయానికి వివేకవంతమైన మాట ఒకటి అని చెడిపోయే పరిస్థితిని సునాయాసంగా చక్కబెట్టేవాణ్ణి, మనుషులు చప్పన గుర్తించరు చిన్న తన నుంచి మానవ స్వభావాన్ని పరిశోధించటం అలవాటయింది. గనక సీతారామయ్యలో ఉన్న విచిత్రమైన సంస్కారాన్ని నేను కనిపెట్టాను. రుజువుకూడా చేసుకుని ప్రచారం ప్రారంభించాను.

ఈ ప్రచారం సులభసాధ్యంకాదు. సాటి మనిషిలో ఒక ప్రత్యేకవిద్య ఉన్నదంటే ఆమోదిస్తారుగాని, ఒక నైతిక ఆధిక్యత ఉన్నదంటే ఎవరూ త్వరగా ఆమోదించరు అటువంటి ప్రచారంచేసేవాణ్ణి కూడా క్షమించరు. కాని నా ప్రచారం నేను మానలేను. అతని స్నేహంవల్ల నేను పూర్వంకంటె మంచివాణ్ణయినా ననే విశ్వాసం నన్ను వదలిపెట్టలేదు. నా కతనివల్ల కలిగిన ఉపకారం మాటలతో నిరూపించేదికాదు. రూపాయి అణాపైసల్లో లెక్కించేదికాదు.

అతనికి నేనేమీ ప్రత్యుపకారం కూడా చెయ్యలేదు, అతన్ని కథలు రాయమని ప్రోత్సహించటం తప్ప. ఈ ఆలోచన అయినా నాకు కలిగినది కాదు అతనంతట అతనే ఒక కథ రాశాడు రాసి దాచిపెట్టుకున్నాడు. ఒకనాడది ఎట్లాగో నాకంటపడింది. చదివాను. నాకాకథ అద్భుతంగా ఉన్నట్టు తోచింది

కథకుడుగా అతని ప్రత్యేకతను గురించి నేను వివరంగా చెప్పను. అతను రాసిన కొద్ది కథలూ వాటికవే సాక్షి. పాత్రలు అనే మాటలకూ, చేసే సామాన్యపు పనులకూ ఒక విచిత్రమైన అంతరార్థం నిరూపించేవాడు. ఏవో సన్నివేశాలు కల్పించి పాత్రలచేత గంభీరంగా మాట్లాడించవచ్చు. కొన్ని సాంఘిక భావాలు ప్రచారంకూడా చెయ్యవచ్చు. కాని మామూలు సంఘటనలే తీసుకొని మామూలుగా మనుషులు చేసే పనులకూ, అనే మాటలకూ ప్రత్యేకత తెప్పించటానికి అపూర్వమైన ప్రతిభ కావాలి సీతారామయ్య రాసినకథ చదవగానే అతను సామాన్యుడు కాదనీ, మనుషుల్ని పుస్తకాలు చదివినట్టు చదవగలడనీ, బతికుండగానే కోసి సునిశితంగా పరీక్షించగలడనీ నాకు తోచింది. అత నా కథలో ఏదో ప్రచారం చేస్తున్నట్టు కనిపించిందిగాని ఏం ప్రచారం చేస్తున్నాడంటే మాటుకు సమాధానం రాలేదు. తరవాత చాలా కాలానికి అతను ఉన్నతమైన మానవత్వం ప్రచారం చేస్తున్నాడని నేను నిర్ధారణ చేసుకున్నాను.

సీతారామయ్యను ఊరేగించటానికి నాకిప్పు డొక పల్లకీ దొరికింది. అదివరకల్లా అతన్ని వ్యక్తిగతంగా పొగడి, నోరు ఖాళీచేసుకున్నాను. కథకుడుగా అతన్ని ప్రపంచం పరిచయం చేసుకోవాలని నేను తీర్మానించాను. పట్టుబట్టి అతనికథ పత్రికకి పంపించి, కథ లింకా రాయమని అతని గొంతుమీద కూర్చున్నాను. అతను నా మాట తీసెయ్యకుండా రాయటం సాగించాడు. కాని అతని కథలు ప్రత్యేకించి గుర్తించినవారు లేరు. గొప్ప కథకుడని అతన్ని పదిమందీ గుర్తించినట్లయితే అతని జీవితం ఎట్లా ఉండేదో చెప్పలేను. అప్పటికీ అతను పతనం అయివుండే వాడేనేమో గాని, ఈ కీర్తి అతన్ని కొంతవరకు రక్షించివుండేదేమోనని నా ఆశ.

"పెక్కుభంగులు వివేక భ్రష్టసంపాతముల్" అన్నారు కని. సీతారామయ్య పతనం అకస్మాత్తుగా జరగలేదు చాలా కాలంవరకూ నాకా విషయమై సందేహం కూడా కలగలేదు.

సీతారామయ్యకు సుబ్రహ్మణ్యంతో పరిచయం కావటం నాకు తెలుసు. సుబ్రహ్మణ్యంతో నాకు స్నేహం లేదు గాని పరిచయం ఉంది. సుబ్రహ్మణ్యం సీతారామయ్య స్నేహంకోసం పాకులాడుతున్నాడని తెలిసి నే నేమీ అడ్డు పడలేదు. నేనెందు కడ్డుపడాలి? సుబ్రహ్మణ్యం లక్షరూపాయల ఆస్తికి పెంపుడు వెళ్ళాడు. వాణ్ణి గారాబంగా చూసే పెంపుడు తల్లి ఉంది. సుబ్రహ్మణ్యం పుట్టి ఊళ్ళో వున్న

తాగుబోతులూ, జూదగాళ్లూ, ముండల ముఠాకోర్లూ తింటున్నారు. మనుషుల్ని కాచి వడబోసిన సీతారామయ్య సుబ్రహ్మణ్యం బతుకు కనుక్కోలేడా? సుబ్రహ్మణ్యాన్ని ఆకర్షించింది సీతారామయ్య కథలు కావు, సంగీతం. ఏ ఆకర్షణ అయితే ఏం? సుబ్రహ్మణ్యం తను తగలేసే డబ్బులో కొంత సీతారామయ్యమీద తగలేస్తాడు. పోనీ, అంతవరకైనా సద్వ్యయమవుతుంది — పాపిష్టి సొమ్ము.

సీతారామయ్యను గురించి నేనేమీ ఆదుర్దాపడలేదు. సీతారామయ్యకు తనంత దగ్గర స్నేహితుడు మరొకడుండ రాదనే అహంభావం సుబ్రహ్మణ్యానికున్నట్టు వాసనపట్టి నేను సీతారామయ్యకు పెడపెడగా కూడా ఉంటూ వచ్చాను.

నేను సీతారామయ్య శక్తి సామర్థ్యాలను అతిగా అంచనా కట్టానేమో ననుకుంటాను. ప్రతిభావంతుడైన మనిషి పరిస్థితులను కొంతవరకు మార్చగలడనేది నిజమే కాని బలవత్తరమైన పరిస్థితులు, ప్రతిభ ఉండినా, ఒంటరిగాడైన వాణ్ణి మరింత సమ్మకంగా మార్చగలవు. సుబ్రహ్మణ్యాన్ని గురించి అందరూ తేలికచేసి మాట్లాడవచ్చు. కాని నా మిత్రశక్తులు సీతారామయ్యవంటి వ్యక్తివేపు లేవు. లత్తు నాపాయల వేపే ఉన్నై. నా మిత్రశక్తులముందు సీతారామయ్య — ఎంత ప్రతిభకలవాడైతే మాత్రం — ఏపాటి? ఈ సంగతి నేను తెలుసుకోలేక పోయినాను. తెలుసుకుంటే ఏం చేసి ఉండేవాణ్ణి? బహుశ ఏమీ చేసి ఉండను.

సుబ్రహ్మణ్యం. సీతారామయ్యను పాటగాడుగా రూఢి చేశాడు. సీతారామయ్య కథలు రాయటం పూర్తిగా మానేశాడు. సుబ్రహ్మణ్యం సీతారామయ్యకోసం ఒక తంబురా కొనిపెట్టాడు. ఒక తబలావాణ్ణికూడా తన పరివారంలో చేర్చాడు.

ఈ తబలిస్టు సీతారామయ్యను, 'ఏయ్, మామా?' అని సంబోధిస్తుండగా నేను స్వయంగా విని నిర్ఘాంతపోయినాను సీతారామయ్యను ఆ పరివారజనమంతా 'మామా' అని పిలుస్తారనీ, సుబ్రహ్మణ్యం అతనితో చాలా తేలిక మాటలు మాట్లాడతాడనీ విన్నాను.

సీతారామయ్య పాటలో ప్రత్యేకత ఏమీ లేదని నా అభిప్రాయం; ఆపాటకు జోహార్లు చేస్తూవచ్చినవాడు సుబ్రహ్మణ్యం. నేను పొరపాటుపడి ఉండవచ్చు. సుబ్రహ్మణ్యమే నిజం గ్రహించిఉండవచ్చు-సీతారామయ్య పాటను చాలా ఎక్కువగా ప్రజలు ప్రశంసించట నేను విన్నాను. కాని నాకుపట్టుకున్నదదిగాదు, సీతారామయ్య పాట కింత జోహార్లు చేస్తూ వచ్చిన సుబ్రహ్మణ్యం ఎట్లా, ఎప్పుడు దానికంటె ఎక్కువైనవాడైనాడు? అతనా వినయం ఎంత కాలమో నిలబెట్టుకోలేదు. తను సీతారామయ్యను పెట్టి పోషిస్తున్న కారణంచేత సీతారామయ్య పాటనుకూడా పెట్టి పోషిస్తున్నవాడల్లే ప్రవర్తించసాగాడు. సీతారామయ్య పాటను తన ఆవరణలో బాగానే ప్రచారంచేశాడు. నిజమే; కాని ఆ ప్రచారంలో తననుకూడా కలుపుకున్నాడు సుబ్ర

హ్మణ్యం సీతారామయ్య పాటలో ఏమన్నా గొప్పతనం ఉంటే అది తనచలవే ననేవిషయం సుబ్రహ్మణ్యం చక్కగా ప్రచారం చేశాడు. అనుమానాస్పదమైన సీతారామయ్య గానకాంతితో తను వెలగాలని ప్రయత్నించాడు సుబ్రహ్మణ్యం.

సీతారామయ్య చేత గ్రామఫోను రికార్డులుకూడా ఇప్పించాడు సుబ్రహ్మణ్యం. దానిమీదవచ్చిన లాభాల కంటె సుబ్రహ్మణ్యం చేతనుంచిపెట్టిన ఖర్చులే ఎక్కువయినై కాని ఇందుమూలంగా సంస్కారప్రపంచంలో ఒక అంగుళం జాగాలేని సుబ్రహ్మణ్యానికి నిలవనీడ లభించలేదా? ఈ అట్టహాసమంతా చూసి కొందరు సంస్కారులైనా సుబ్రహ్మణ్యాన్ని తమవర్గంలోకి స్వీకరించలేదా?

సుబ్రహ్మణ్యం ప్రోత్సాహంతో సీతారామయ్య స్టేజ్ ఎక్కాడు. నాటకాలాడాడు. లాభనష్టాలమాట దేవుడెరుగు. సుబ్రహ్మణ్యానికి వ్యాపారదృష్టి ఏకోశానాలేనప్పుడు సీతారామయ్య ఆడిన నాటకాలు ఆర్థికంగా విజయవంతమయిందీ కానిదీ తేల్చటానికి అవకాశం ఎక్కడుంది? ప్రపంచానికి సీతారామయ్య పైకి వస్తున్నాడన్న భ్రమకలిగింది. కాని పైకివచ్చినవాడు—సీతారామయ్యను అడ్డంపెట్టుకుని తనకు సంఘంలో చొరరానిచోట్లకు వెళ్ళినవాడు—సుబ్రహ్మణ్యం.

ఆఖరుదశ సినిమా చిత్రనిర్మాణం—ఆపైన ఏమీ లేదు. ఆసినిమాచిత్రం పూర్తిఅయి బయటపడిఉంటే ఇంకేమేమి జరిగేదో చెప్పలేం. కాని అది పూర్తికావలిసిలేదు..

సీతారామయ్యకోసం దివాలాతీసినట్టు సుబ్రహ్మణ్యం అందరితోనూ చెప్పుకుంటున్నాట్ట! "నాసొమ్మంతా సీతారామయ్య తాగుడుకూ, సీతారామయ్య ముండలకూ, సీతారామయ్యను పైకితేవటానికీ పెట్టాను" అంటాట్ట సుబ్రహ్మణ్యం! ఈముక్క పచ్చి అబద్ధమైతే నేను బాధపడను. సీతారామయ్య తాగినమాట అబద్ధంకాదు, అతనిముండలూ యదార్థమే.

సీతారామయ్య తానై తాగిఉండడనీ, చవుకబారుముండలతో వ్యభిచరించి ఉండడనీ నాకు రూఢిగా తెలుసును. అతని పనులు చెయ్యటానికీ సుబ్రహ్మణ్యానికీ సన్నిహిత సంబంధం ఉంది. కాని సీతారామయ్యను తిట్టేవాళ్ళ ఎదట నేనతన్ని సమర్థించలేను, ఎట్లా సమర్థించనూ? సీతారామయ్య సుబ్రహ్మణ్యం వంటి అధముడి దగ్గిరికి అంత దగ్గిరిగా ఎందుకు వెళ్ళవలిసివచ్చింది! సీతారామయ్య దారిద్ర్యంతో నాకు సానుభూతి ఉంది. కాని ఆ దారిద్ర్యానికి సీతారామయ్య అంతగా ఎందుకు లొంగిపోవాలి? ఎక్కడో ఒకచోట అతను తిరుగుబాటు ఎందుకు చేసి ఉండకూడదూ? కొన్ని పరిస్థితుల్లో జీవించేకంటె చచ్చిపోవటం మేలుకాదా! సీతారామయ్య అంత తప్పనిసరిఅయితే దారిద్ర్యంతో మాడి ఎందుకు చావలేక పోయినాడూ? నాది కఠినమైన తీర్పుగా కనిపించవచ్చు. జీవితం కఠినంగా ఉన్నప్పుడు జీవితంమీది తీర్పులు నాజూకుగా ఎట్లా ఉంటై!

సీతారామయ్య ఆత్మగౌరవంకంటె విలవైనదాన్ని పోగొట్టుకున్నాడు. అతనిభార్య సరస్వతి అతను పంపిస్తూ

వచ్చిన డబ్బు తీసుకో నిరాకరించిందని విన్నాను. తనకొడు కుతో సహా పుట్టింటికి చేరి ఒంటిమీద ఉన్న కొద్దిపాటి నగలు అమ్ముకుంటూ కొంతవరకు కాలక్షేపం చేసింది. ఆ తరవాత దగ్గిర బంధువుల దగ్గిర ముష్టెత్తింది. ఈసంగతివిని నేను కొంత డబ్బు పంపుతూవచ్చాను. తీసుకున్నది.

సుబ్రహ్మణ్యం తలపెట్టిన సినిమా మిషమీద తాగు డుకూ, ముండలకూ సుబ్రహ్మణ్యం డబ్బంతా అయిపోయి, సుబ్రహ్మణ్యానికీ సీతారామయ్యకూ పూర్తిగా తెగిపోయి నాక సీతారామయ్య భార్య దగ్గిరికి తిరిగివచ్చాడని, భార్య అతన్ని స్వీకరించిందనీ విని సంతోషించాను గాని ఆశ్చర్య పడలేదు. భార్యను సమాధానపరిచేపాటి మానవత్వం సీతా రామయ్యలో ఇంకా మిగిలి ఉంటే అందులో ఆశ్చర్యం ఏమీలేదు.

ఊళ్ళోనే ఉన్నాడని తెలిసికూడా చాలాకాలం నేను సీతారామయ్యను చూడబోలేదు. మా కిద్దరికి మధ్య ఏదో తెగిపోయినట్టయింది. కాని నిష్పక్షపాతంగా ఆలోచిస్తే సర స్వతికి లేని బెట్టు నా కెందు కుండాలో అర్థంకాలేదు. ఈ మాట అనిపించినాక సీతారామయ్యను చూడటానికి నిశ్చ యించుకుని బయలుదేరి వెళ్ళాను.

సీతారామయ్య ఇంట్లోలేడు. సరస్వతి పిల్లవాడికి అన్నం పెడుతున్నది. మనిషి ఎప్పటి మాదిరిగానే ఉంది గాని ఏమాత్రమూ విచారంగా లేదు. సీతారామయ్యను

విమర్శిస్తూనే మాట్లాడాను, సరస్వతి నాపక్షం ఉంటుందని ధైర్యంతో.

కాని సరస్వతి నాపక్షం కాలేదు.

"జీవితం పాడైపోకరిస్తే ఎవరుమటుకేం చేస్తారు?" అన్న ద్రావిడ.

"దానిజోలికి పోకపోతే ఎందుకు కరుస్తుంది?" అన్నాను.

"ఇంట్లో కూచుంటే మనిషి కే సంఘమూ ఉండదు గద? ఏదో సంఘంలోకి పోక ఎట్లా తప్పుతుంది?" అన్నది సరస్వతి.

"ఈ సుబ్రహ్మణ్యం సంఘం తప్ప ఇంకేమీ దొరకలేదా?" అన్నాను.

"ఇంకేం దొరికింది?" అన్నది సరస్వతి.

ఆ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేకపోయాను. నిజానికి సీతారామయ్యను కథకుడని ఎవరూ గుర్తించలేదు. కాని అతని సంగీతం అతిన్నం ఉద్ధరించింది! అతను మళ్ళీ ఎప్పటి స్థితికే వచ్చాడుగద! ఈమాటే సరస్వతిని అడిగాను.

సరస్వతి నాకేసి ఆశ్చర్యంగా చూసి, "ఇప్పుడాయన కోసం ముగ్గురు ఫిలింకంపెనీవాళ్లు తిరుగుతున్నారు" అన్నది.

నేనామాట నమ్మలేకపోయినాను. కాని నిజమే అయి ఉండాలి సీతారామయ్య కథల్ని ఖాతరుచెయ్యని ప్రపంచం

అతనిపాట ఆమోదించింది. నేనేరైటనీ, ప్రపంచం తప్పనీ నాకు తెలుసును. సుబ్రహ్మణ్యాం వెంటపడి సీతారామయ్య ప్రపంచానికి దూరమైపోయినా దనుకోటం నాభ్రమ—నా అహంకారం. ప్రపంచం నాకు దగ్గిరిగాలేదు. సుబ్రహ్మణ్యానికే దగ్గిర ఉంది. సాంఘికశక్తులు సుబ్రహ్మణ్యం లక్షణాపాయలవేపు మొగ్గినట్టే ప్రపంచం సుబ్రహ్మణ్యం సంస్కారంవేపు మొగ్గిఉంది.

ఈ మాట సరస్వతితో చెప్పాను. చెప్పి, "ఈ ప్రపంచాన్ని ఇట్లాఉంచటం నాకిష్టం లేదు. నావేపు తిప్పుకోవాలి. ప్రపంచాన్ని నాపక్షం చేసుకునేటందుకు ఒకప్పుడు సీతారామయ్యను కథలు రాయమన్నాను. ఇప్పుడు నేను ఒంటరిగాణ్నయిపోయినాను" అన్నాను.

సరస్వతి నన్నుచూసి నవ్వి లోపలికివెళ్ళి ఇంతలావు కాగితాలకట్ట తెచ్చి నాముందు పడేసింది. నాకు దాన్ని చూడగానే పరమానంద మయింది. సీతారామయ్య నన్ను ఏమరలేదు.

"ఎంతకాలంనుంచీ రాస్తున్నాడు!" అన్నాను.

"రెండేళ్ళనుంచీ"

సుబ్రహ్మణ్యందగ్గిరికివెళ్ళిన కొద్దికాలానికే ఈ బ్రహ్మాండమైన పుస్తకం ప్రారంభించాడన్నమాట! ఎంత పొరపాటుపడ్డాను!



# రక్తస్పర్శ

శివానికి చాలా చాతనవు—బడి ఎగగొట్టటమూ, బలవంతాన పంపించినరోజున మేష్టరుకళ్లల్లో కారంకొట్టి తప్పించుకు పారిపోవటమూ, మేష్టరు వెయ్యికళ్ళతో కనిపెట్టివుండి, కడంపిల్లల జోక్యంమానేసి, వాడిచేత గంటసేపు ఒకేపాఠం చదివించినా ఒక్క ముక్క రాకుండా పరధ్యానంగా చదవటమూ, తన ఈడు పిల్లవాడెవడైనా ఒంటరిగా దొరికితే వాడితో ముందు పరిచయం చేసుకుని తరవాత పోట్లాడి ఆఖరుకు వాణ్ణి మెత్తగా తన్నటమూ, వారానికొకసారి ఏదో ఒకవిధంగా ప్రాణంమీదికి తెచ్చుకోవటమూ, సినిమాలకూ, నాటకాలకూ, సర్కసులకూటిక్కెట్టులేకుండా వెళ్ళటమూ, బొగ్గుతో ఊళ్లోగోడలమీద తన నోటికివచ్చిన దౌర్భాగ్యపుమాటలు రాయటమూ, సిగరెట్లు (కానీకి అయిదురకం) కాల్చటమూ ఇంకా ఎన్నో! కాని వాడికి ఆడపిల్లలదగ్గిర ఎట్లా ప్రవర్తించాలో చాతకాదు. వాడి కసలు

ఆడపిల్లలంటే భయం. ఆ భయం జాస్తిగా కలిగినప్పుడు వాళ్ళకు వైదొలగి, తను పాతికేళ్ళ మగవాడయినట్లూ, వాళ్లు కాపరం చేసేవాళ్ళయినట్లూ, ప్రవర్తించేవాడు. కాస్త ఉత్సాహంవుండి, భయాన్ని కొంతవరకు జయించినప్పుడు తనూ, వాళ్లూ, చంటిపిల్లలయినట్లు ప్రవర్తించేవాడు. వాడి ఈ ప్రవర్తనే ఆడపిల్లలకు గోతగా వుండేది.

ఇవాళ వాడు ఉత్సాహంతో ఉన్నాడు. మొదటి సంగతి: బడి ఎగగొట్టేశాడు. ఆ తరవాత: వాళ్ళమ్మ గూట్లో పెట్టి మరిచిపోయిన అణా కాసాకటి కొట్టేశాడు. ఇంతేకాక వాడు ఎన్నడూ ఎరగని కిల్లీకొట్టుమీదికి వెళ్ళి "ఏమయ్యోయ్ ఒక బీడీ ఇవ్వు!" అని దబాయించి అడిగి ఆబీడీ సంపాదించాడు! ఈ ఉత్సాహంలో వాడు ఇంటికి వచ్చేటప్పటికి లక్ష్మి, పక్కింటివాళ్ళ బాలాంబా కలిసి సారె బొమ్మలకు గుడ్డపీలికలతో దుస్తులు కుట్టుకుంటున్నారు.

శివం కాసేపు కాళ్ళెడంగా పెట్టి వాళ్ళ కార్యక్రమం నిష్పక్షపాత బుద్ధితో గమనించి, ఆఖరుకు వొంగి ఒక చిన్న గుడ్డపీలికతీసి లక్ష్మినెత్తిన వేసి, "ఒకమ్మాయిగారి నెత్తిన గోరంక!" అని పాడాడు. బాలాంబ ఒకసారి వాడివంక తీవ్రంగాచూసి వాడక్కడ లేనట్టే నటించింది.

లక్ష్మిమాత్రం వాడివంక రౌద్రంగా చూసి, "నీ కాడ పిల్లలతో ఏమాటలురా? అసలు నువ్వు బళ్లోకివెళ్ళక ఇక్కడున్నావేం? అమ్మతో చెప్పనా? అని అంతకంతకూ గొంతు హెచ్చించసాగింది. వంటఇంటో ఉన్న తల్లికి వినపడాలని ఆ పిల్ల తాత్పర్యం.

శివం తన నిర్లక్ష్యం ప్రకటించటానికి అసహ్యంగా నవ్వుతూ, మళ్ళీ వొంగి లక్ష్మి చేతిలోవున్నబొమ్మ లాక్కున్నాడు.

ఈసారి లక్ష్మి గట్టిగా అరుస్తూ "ఆబొమ్మ ఇచ్చెయ్యరా! నీకేం తెగులుట్రా?... అమ్మా, ఈ శివాయ్ చూడవే! నన్నుల్ని ఏడిపిస్తున్నాడూ... వెధవా!" అన్నది.

"నువ్వే వెధవముండవు!" అంటూ శివం లక్ష్మినెత్తిన ఆ బొమ్మతో ఒకటిపెట్టి తృప్తిపడక మళ్లీ ఇంకోటిపెట్టి, ఆ బొమ్మ ఎత్తి నాపరాళ్ళమీదపడేసి ఎటో అయిపులేకుండా వెళ్ళిపోయినాడు

రేపో ఎల్లుండో పెళ్ళికాబోతున్న లక్ష్మి, పైగా తన స్నేహితురాలిముందు అసహాయత్వం ప్రకటించటానికి గాని, ఏడవటానికిగాని చాలా బిడియపడ్డది. బయటికి కక్కన కోపంకంటె దిగమింగినకోపం కెట్టింపు! లక్ష్మి పెదవులు మాత్రం కదిలిస్తూ శివాన్ని లోపలే "వెధవ, వెధవ, వెధవ! అని లెక్కపెట్టకుండా పదమూడుసార్లు తిట్టుకున్నది.

ఈ సంఘటన లక్ష్మికీ, బాలాంబలకూ ఎంతఅసహ్యకరంగా కనిపించిందో, శివానికీ అంత అసహ్యంగానే తోచింది. కాని ఏంచేస్తాడూ! తను ఎంతో సదుద్దేశంతో ఏంచెయ్యబోయినా ఆఖరుకు అట్లా పరిణమిస్తుంది. ప్రపంచం అంతటా లక్ష్మిపంటి దుర్మార్గులు వుండటంవల్ల తన చేతలన్నీ ఇట్లా పరిణమించుతై. తనకోపం ఎన్నడూ ఉండదని శివం ఎప్పుడూ ఎరుగును. వాడికసలు అక్కమీంద ఎంతో ఆపేక్షా,

అభిమానమూ ఉన్నై (లక్ష్మిమీద చెయ్యిచేసుకున్న మరు క్షణం ఆ సంగతి వాడికి ఎంత నమ్మకంగానో తెలిసేది). కాని ఏంలాభం? ఆ అపేక్ష చూపించేటందుకు తనకు అవ కాశమే దొరకదుగా! తన ప్రారబ్ధం!

పశ్చాత్తాపం అందరికీ ఒకవిధంగా రాదు. ఇది శివం యొక్క పేలెంటువిధం. వాడు తనదృష్టిలో తానుహీనుడల్లే కనపడేకంటే తనవల్ల అపకారం పొందినవాళ్ళని తనదృష్టిలో అధికం కానిచ్చేవాడు. ఇటువంటి సంఘటన—లక్ష్మిమీద చెయ్యిచేసుకోవలసిన అత్యావశ్యకత—కనీసం రోజు కొక సారి అయినా కలుగుతూవుండేది కనక ఈపాటికి లక్ష్మి శివందృష్టిలో దాదాపూ ఒక దేవతంతగా అయిపోయింది. అయితే ఈ విషయం నిరూపించటానికి శివాని కింకా అవ కాశం రాలేదు. ఈ పరమ రహస్యం ఇంకా శివం హృద యంలోనే బంధించి ఉంది.

* * *

లక్ష్మి తమ్ముడికంటె సరిగ్గా ఒక సంవత్సరం పెద్ద. వాడికి పదోఏడు వచ్చింది—ఇంకా ఏ బి సీ డీ లు రాక పోయినా, లక్ష్మికి పదకొండు వచ్చినయి. తన తండ్రిని ఇద్దరూ ఎరగరు. వాళ్ళు బుద్ధితెలిసినప్పటినుంచీ తల్లి శిక్షణ కిందనే పెరిగారు.

ఆవిడకు పిల్లల్ని పెంచటం ఏమీ చాతకాదు. చాత కాదని ఆవిడకుగాని, ఆవిడని మెచ్చుకున్న వాళ్ళకుగాని

తెలీదుకూడాను. ఆవిడ తన ఇద్దరు పిల్లల్ని ఒకరిమీద ఒకర్ని కాపలా పెట్టింది, వాళ్ళిద్దరికీ సహజమైన వైరం ఉంటుందని ఆవిడ విశ్వాసం. (ఆ విశ్వాసానికి ఆధారాలేమిటో నా కయితే తెలీదు !) కాని వాళ్ళ ప్రవర్తననుబట్టి ఆవిడ విశ్వాసం సరిఅయినదేనని ఎవరైనా భావించవచ్చును. యదార్థమేమిటంటే, వాళ్ళ ఈ ప్రవర్తనకు ఆవిడ విశ్వాసమే కారణం ఆ ఇల్లాలు తన పిల్లలిద్దర్నీ ఒకరిమీద ఒకరిని కాపలాపెట్టటమేకాక ఒకరినించి ఒకరిని సంరక్షించటంలో చాలా ప్రయాసలకు లోనయ్యేది. ఆ ఇద్దరిలోనూ ఏ ఒకరు గాని రెండోవారిమీద ఏ నేరం మోపినాసరే, ముందూ వెనకా ఆలోచించకుండా శిక్షించేది. ఎవరివిషయంలో వారు నిజం చెప్పరని ఆవిడ కెంత విశ్వాసమో, రెండోవాళ్ళ విషయం అబద్ధం చెప్పరనికూడా ఆవిడ కంతే విశ్వాసం.

ఎప్పటికన్నా ఈ ఇద్దరూఒకటవుతారనికాని, కావచ్చుననికాని ఆవిడకు తట్టలేదు. తమ్ముడికి అండగా నిలవాలనే భావం మొదట లక్ష్మికే కలిగింది. ఆ పిల్ల తమ్ముడి దుష్ప్రవర్తన జాస్తి అవుతున్నకొద్దీ వాటిని తల్లి దగ్గరబయటపెట్టటం తగ్గించింది—బయటపెడతానని తమ్ముణ్ణి బెదిరించటం జాస్తి చేసినా, శివం తన విషయంలో అటువంటి ఔదార్యం ఇంకా పూనలేదనే విషయంకూడా లక్ష్మిని బాధించలేదు.

లక్ష్మియొక్క ఈ మనస్తత్వానికి కారణాలు నిశ్చయించటం సులభంకాదు. దానికి కారణం స్త్రీలకు అధికంగా ఉండే సహానశక్తి కావచ్చు: లక్ష్మిలో త్వరగా విక

సించిన మాతృత్వం కావచ్చు; ప్రతిఫలం కోరని సోదరి ప్రేమ కావచ్చు; తల్లినల్ల తమ్ముడికి కలిగే శిక్షలో ఉండే న్యాయంలో అవిశ్వాసం కావచ్చు; అవేవీ కాకపోతే ఇందుమూలంగా తమ్ముడిమీద తనకు దినదినమూ జాస్తి అవుతున్న అధికారంమీద ప్రీతికావచ్చు.

కాని క్రియకు జరిగిందేమంటే, లక్ష్మికి తమ్ముడిమీది ప్రేమ రహస్యంగా వృద్ధికాసాగింది—ఆ ప్రేమకు శివం అనర్హుడవుతున్నకొద్దీ! మనం క్షమించ గలిగిన మనిషిని ఎప్పటికీ ప్రేమించలేం సరేకదా, మనశిక్ష ఎంత న్యాయమైనదైతే మనకు ప్రేమ అంత అసాధ్య మవుతుంది! ఈ రహస్యం తెలియక ఆ పిల్లలతల్లి తన సంతానాన్ని ఎప్పుడూ న్యాయంగానే శిక్షించేది! ఆవిడ తన పిల్లల్ని అన్యాయంగా శిక్షించినా పశ్చాత్తాపంద్వారా ప్రేమ సాధ్యమై ఉండును. శివానికి రహస్యంగా అక్కమీద ప్రేమ ఉండినట్లు.

*　　　　*　　　　*

లక్ష్మికి సంబంధం విచారిస్తున్నారు. అది ఏ క్షణాన పెద్దమనిషి అవుతుందోనని ఒకరకొకరు అవకాశం దొరికి నప్పుడల్లా చెప్పుకోవటం ఫాషనుగా ఉంది వాళ్ళ బంధు వర్గంలో. నిజానికి లక్ష్మిలో అటువంటి లక్షణాలింకా ఏమీ లేవు. అది పదకొండేళ్ళపిల్ల అంటే ఎరగనివాళ్ళు నమ్మటం కూడా కష్టమే శివం అక్కకన్నా కనీసం రెండేళ్లు పెద్ద వాడనిపిస్తాడు. కనక ఆ భయం నిజంగా ఎక్కువ మందికి

లేదు. పైగా అటువంటి అపూర్వమైన సంఘటన జరిగితే ఏమవుతుందో తెలుసుకుందామని లోపల చాలామందికి ఉందికూడాను.

"నీకు రావణాసురుడంటి మొగుడు రావాలే! అప్పుడు గాని నువు చచ్చినట్టు పడిఉండవు;" అనేవాడు శివం ఇంచు మించు ప్రతిరోజూ. పైకి అట్టా అంటూనే వాడు లోలోపల ఆశ్చర్యపోయ్యేవాడు. తననోటికీ తన హృదయానికీ ఉన్న వైరం చూసి, తన మనస్సును నోటితో దాస్తున్న సంగతి వాడెరగడు. వాడికంత ఆత్మజ్ఞానం లేదు.

లక్ష్మికి సంబంధం విచారిస్తున్నది దాని పినతండ్రి. ఆయనగారినిచూస్తే శివానికి మొదటినుంచీ పైకి భయమూ, లోపల కోపమూనూ. (వాడి చదువు విషయమూ, వాణ్ణి నాద్దులో ఉంచాలనే విషయమూ మొదటినించీ ప్రచారం చేస్తూ వచ్చింది ఆ పెద్దమనిషే!)

ఆయన లక్ష్మిపెళ్ళి బరువంతా తన మెడమీదనే ఉన్న సంగతి ఏమాత్రమూ దాచకపోగా అప్పుడప్పుడూ "అబ్బబ్బ సొంతపిల్లలకు సంబంధం వెతకటమే కష్టం! మరొ కరి పిల్లలకు వెతకటంకంటె బాధ్యతో పని ఇంకోటి ఉండ బోదు." అని ఆపసోపాలు పడేవాడు.

ఆయన ఆమాట అన్నప్పుడల్లా శివానికి శివమెత్తేది. తన అక్క పెళ్ళిభారాన్ని తన పినతండ్రి సంతోషంతో భరించాలని వాడి అభిప్రాయం కావచ్చును! అంత అయి

ష్టంలో చేసే సహాయం స్వీకరించటానికి తన తల్లి కెట్లా సిగ్గులేదా అని వాడికి అనిపించేది. అది అట్లా ఉండగా ఆ పినతండ్రి సొంత అల్లుణ్ణి వెతకటానికయితే ఎంత శ్రమపడునో అందులో కొంత మాత్రమే పడి లక్ష్మికి మొగుణ్ణి తీసుకు రాబోతున్నాడని అస్పష్టంగా అర్థంచేసుకుని శివంమనస్సు అదో విధమైన ఆరాటంలో పడసాగింది. ఆ ఆరాటానికి తగినట్టే లక్ష్మిని చూడటానికివచ్చే ఒక్కొక్క వ్యక్తిని కళ్ళారా చూస్తున్న కొద్దీ దానిపెళ్ళి జరగవలిసినట్టు జరగ దనే భయం శివానికి జాస్తి కాసాగింది.

ఇప్పటి మనస్థితిలో లక్ష్మిని పెళ్ళాడటానికి సాక్షాత్తూ ఆనిషధేశ్వరుడే వచ్చినప్పటికీ అతను శివంయొక్క తీవ్ర విమర్శను గురికాకుండా తప్పేటట్టు లేదు—వాడి పిన తండ్రి ఆశే కట్నం ఖర్చులేకుండా చూసి తెచ్చిన చవు కబారు సంబంధాలొకలెక్కా ?

ఆఖరుకు లక్ష్మి వివాహం స్థిరమయింది. పిల్లను చూడటానికి వరుడు స్వయంగా రాలేదు. తనతల్లినీ, అక్క గారినీ తోడిచ్చి తండ్రిని పంపాడు. ఆ వచ్చినవారి అంద చందాలను బట్టి వరుడుమీద శివానికి మంచి అభిప్రాయం కలగలేదు (ఆ విషయం విచారించినవారు లేకపోవటం శోచ నీయాంశం!) వచ్చినవారు పిల్లను చూసి, నిరభ్యంతరంగా మెచ్చుకున్నారు. ("మీ వెధవమెప్పెవరికి కావాలి? మా అక్కయ్య మీ ప్రాణాలకి భూలోకరంభే!" అనుకున్నాడు శివం నిరక్ష్యంగా!)

వరుడు స్కూలు ఫైనలుదాకా చదివి మానేశాడని విని లాగుముడి నమ్మకంగా విస్కూలోలేని శివం—స్కూలు ఫైనలుదాకా చదువుదామనే ఆశగాని ధైర్యంగాని లేని శివం—పెదిమ విరిచాడు

వరుడికి బోలెడంత ఆస్తివుందని తెలిసి శివానికి మండిపోయింది. ఆ ఆస్తికి లక్ష్మిని బంధువులంతా కలిసి విక్రయిస్తున్నారని శివం తన అంతరాత్మలో రూఢిచేసుకున్నాడు.

బంధువులంతా కలసి ఈ సంబంధం చాలా బాగుందని ఒకరితో ఒకరు అనుకుంటున్నకొద్దీ శివానికి ఒంటరితనం దుర్భరమైపోయింది. తన పక్షం పలికేవాడు ఒక్కడన్నా లేడా? ఇంతమందీ కట్టకట్టి తననూ, లక్ష్మినీ ముంచాలని చూస్తున్నారా? తనకింకా నాలుగేళ్ళు—కనీసం మరో రెండేళ్ళు—ఉన్నట్టయితే వీళ్ళ ఆటలు సాగునా?

తనబాధ కంతా కారణం అసూయ అని శివం ఎరగడు, వాడి కెవరు చెబుతారు? అసలు వాడు బాధపడుతున్న సంగతి ఎవరూ ఎరుగరు—వాడి స్నేహితుడు హనుమంతాయితప్ప!

హనుమంతాయీ, తనూ చెరువుగట్టున కూర్చుని లక్ష్మి పెళ్ళివిషయం చాలాసేపు చెప్పుకున్నారు—బీడీలు కాలుస్తూ! కనీసం తను చెబుతుంటే హనుమంతాయి సహృదయంతో విన్నాడు.

“వాడు వట్టి పల్లెటూరిగబ్బిలాయిరా!” అన్నాడు శివం—బీడీపొగ వదులుతూ. మొహంలో ఒక విధమైన విచారమూ, గీర్తి ఘాటూ కనబరుస్తూ. “డబ్బుంది వెధవకు! అయితే చదువులేదు వెధవకు. వెధవ కోతిమాదిరిగా ఉంటాడు.” (తను వరుణ్ణి చూడలేదన్న సంగతి హనుమంతాయితో చెప్పకతేనేం? రేపు రుజువయ్యే విషయమేగా!)

హనుమంతాయి కొత్తబీడీ పాతబీడీతో అంటిస్తూ, “ఈ పెళ్ళిళ్ళు—!” అన్నాడు గాంభీరంగా.

♦ ♦ ♦

శివం బావమరది కనకయ్య తన బావమరిది అంటే మొదటినుంచీ ఒక విధమైన వాత్సల్యం కనబరుస్తూ వచ్చాడు. ఈ వాత్సల్యం శివం హృదయంలో ఎటువంటి మంట పుట్టించిందీ కనకయ్య ఎరగడు.

కనకయ్యను శివం ఏవిధంగానూ క్షమించలేకపోయినాడు. కనకయ్య అసలు ఎవడూ? తన్ను “ఒరేయ్ అని పిలవటానికి, ఏవైనా పనులు చెప్పటానికి వాడికి ఏమధికారం ఉందీ? లక్ష్మి మొగుడై కూర్చోవటానికి కేమధికారం ఉందీ? వాడు (తనలో తను తన బావమరిదిని వాడనుకోవటానికి కూడా శివానికి చాలా సాహసం కావలసివచ్చిందని పాఠకులూహించాలి!) వాడు తను అనుకున్నంత కోతిగా ఉండకపోవటమేం? బావమరిది అయినందుకే తనకింతగా

పనులు చెప్పి తనమీద అధికారం చలాయిస్తున్నవాడు రేపు లక్ష్మిమీద ఎంత అధికారం చలాయించడూ?

పెళ్లి వైభవమూ, ఉత్సాహమూ తనని అంటనుండా ఉండేటందుకు శివం తన యీడుకుమించిన అమానుషమైన ప్రయత్నంచేసి గెలిచాడు. ఆ అయిదురోజులూ పెడపెడగా తిరిగాడు; వెలుతురుకూడా రాని మూలల నక్కాడు; ఎవరికీ కనిపించలేదు. భోజనంకూడా సరిగా చెయ్యలేదు; కొత్తబట్టలైనా కట్టుకోలేదు. అయితే ప్రత్యేకించి శివం విషయం గమనించినవారు లేకపోయినారు.

పెళ్ళికూతుర్ని చేసిన లక్ష్మి అందరికీ నేత్రపర్వంగా ఉంటే శివం కళ్ళకి ఎవరోలా అనిపించింది. దానివంక చూసి వాడు, "ఇది నా అక్క!" అని అనుకోలేకపోయినాడు; చూడలేకపోయినాడుకూడానూ! పెళ్ళయిన నెల దాకా లక్ష్మి వాడి దృష్టిలో మామూలుమనిషి కాలేదు.

పెళ్ళి అయిన రోజునించీ ఆ క్కా తమ్ములకు కొత్త సంబంధం ఏర్పడ్డట్టయింది. ఇద్దరూ పరస్పరానురాగం వెను కటికన్నా స్వేచ్ఛగా చూపించసాగారు. ఈవిషయంలో శివానిది పరిపూర్ణమైన పరివర్తన. వాడు లక్ష్మి వివాహం గురించి తన అభిప్రాయం స్పష్టంగా లక్ష్మికి తెలియచేశాడు. లక్ష్మి తమ్ముడి ఉద్రేకం అర్థం చేసుకోలేదుగాని వాణ్ణి మార్చటానికి ఏ ప్రయత్నమూ చెయ్యలేదు. శివం తనని గుచ్చి అడిగినప్పుడు మాత్రం తనకే సంబంధమైనా ఒకటే నని తమ్ముణ్ణి నమ్మించింది. ఆ నమ్మకం శివం ఆరాటాన్ని

కొంతవరకు తగ్గించింది. సంతృప్తి కలిగించలేదు. తనకు సరి అయిన భర్త రాలేదని లక్ష్మి ఎప్పటికైనా తెలుసుకొంటుం దని శివం లోలోపల భయపడుతూనే ఉన్నాడు.

శివానికి తన బావమరిదితో ప్రవర్తన ఎంత కాలానికీ గాడిలో పడలేదు—కుదరలేదు. దారుణమైన దురభిప్రాయం తోనూ, ఏవగింపుతోనూ ప్రారంభించి శివం తన్ను తను సంస్కరించుకునే ప్రయత్నంలో కనకయ్యకు అతి మంచిగా పరిణమించాడు. మళ్లీ దాన్ని సంస్కరించుకునే ప్రయ త్నంలో అతిద్వేషం ప్రకటించారు. శివం ప్రకృతి కనకయ్య మీదిగా అటునించి ఇటూ, ఇటునించి అటూ ఉయ్యాల లూగసాగింది.

"మా బావమరిదితో ఎటుపోయినా చిక్కే. మరో నిముషానికి వాడిబుద్ధి ఎట్లాఉండేదీ తెలీదు. వాడికి మొత్తానికి చపలచిత్తమే" అని కనకయ్య నిర్ధారణ చేశాడు—శివంతో తగుమాత్రం అనుభవం అయినమీదట.

ఒళ్ళు పై తెలియకుండాతిరిగేవాడు, ఒకదెబ్బ తిన్న మీదటకొంత నిషాదిగి, ఇంకాదెబ్బలుతగిలినకొద్దీమామూలు మనిషికింద మారి బాధ్యత గుర్తించటం నేర్చుకుంటాడు. లక్ష్మిపెళ్ళి శివానికి దెబ్బగా పరిణమించింది వాడి పొగరు కనీసం సగమైనా చచ్చింది. చదువుమీద వాడికి కొంత ధ్యానం పుట్టింది ప్రశ్నలకు మరీ కొక్కిరాయి సమాధానా లివ్వటం చాలవరకు తగ్గించాడు.

* * *

లక్ష్మి పెళ్ళికి ఇరవై అయిదువందలు అప్పయింది. ఖర్చు అమితంగా అయిందని విమర్శించిన వాళ్ళలో శివం పినతండ్రి తగూ పెట్టుకోలేదు. ఆయన ఏమాత్రమూ చలించకుండా "ఇదే నాకూతురు పెళ్ళి అయితే పదిహేనువందల పైన ఒక్క కాసీ అయివుండదు" అనేశాడు. పరోపకారం చెయ్యటంలోఉన్న కష్ట సుఖాలు ఆ ఒక్క ముక్కలోనే విదితమయినై — అర్థం చేసుకోగలవాళ్ళకి.

ఈ పెళ్లిలో ఆ పెద్దమనిషి కనీసం నాలుగైదు వందలు కొట్టేశాడని వదంతి ఒకటి పడింది. కాని ఈ మాట ఆయనతో ఎవరూ అనలేదు. అంటే తప్పక చక్కని భావ గర్భితమైన సమాధానం ఇచ్చివుండేవాడే.

జరిగిందేమో జరిగిపోయింది. ఈ బాకీ తీరేమార్గం కనిపించలేదు — ఉన్న ఏడెనిమిదెకరాల భూమిలో కొంత అమ్మటంతప్ప. అనాదిగా (అంటే పదిహేను సంవత్సరాల నించీ) వస్తున్న పొలంలో ఏడోవంతో ఎనిమిదోవంతో అమ్మటం అందరికీ కష్టంగానేవుంది. కాని అమ్మక తప్పదని అంతా గ్రహించారు. అయితే యిక్కడ మళ్ళీ శివం పిన తండ్రిగారి లౌకికజ్ఞానం చాలా ఉపయోగపడింది.

"ఆ బాకీ దానంతట అదే చెల్లుబడిపోతుంది. శివం చదువు పూర్తిచేసి నాలుగురాళ్ళు సంపాదించి వాడిపొట్ట వాడు పోసుకోవటం మొదలుపెట్టగానే పొలంలోవచ్చేది ముట్టుకోనవసరం ఉండదు. దానితో అప్పుకాస్తా తీర్చవచ్చు. ఈలోపల ఉందే, ఏసాలుకాసాలు ధాన్యం అమ్మేసి బాకీలో

చెల్లువేసేదీ, ఏనెల కావలసింది ఆనెల అప్పుచేస్తూ వుండేదీ! బంగారంవంటి పొలం ఎందుకు పాడుచేస్తారు? మళ్లీ మన శివం సంపాయించబోయినాడా, పెట్టబోయినాడా?" అన్నాడా పెద్దమనిషి.

"నేను సంపాదించటమూ, పెట్టటమూ లేకపోతే ఆ బాకీ తీరనే తీరదుగా! నేను సంపాయిస్తే ఈమాత్రం పొలం అప్పుడే కొనుక్కోవచ్చుగా!" అన్నాడు శివం తెలివిగా. ఆ ముక్కతో పినతండ్రి వచ్చిన కంగారు వాడికి తనలో మూడోవంతు వయసు లేని సత్యం, ప్లీడర్లుకూడా మాట్లాడ లేని తనతో ఇట్లా మాట్లాడటం సహించలేక వాడి పినతండ్రి వెర్రినాడల్లేపేలాడు ఆ పేలాపనయొక్క సారాంశం ఏమంటే: "శివం సంపాయించని తన అనుమానమే కాని, సంపాయించకుండా ఉండాలని తన అభిప్రాయంకాదు: ఇప్పుడు రెండెకరాలు పోగొట్టుకుంటే ఈ రెండెకరాలే రమ్మంటే ఎప్పుడూ రావు!"

చిన్నపిల్లలుకూడా అర్థంవున్న తెలివిని విమర్శించగలడు. కాని ఇటువంటి అర్థమూ, సందర్భమూ లేని అతి తెలివిని విమర్శించలేరు. శివం మళ్లీ నోరెత్తలేదు.

శివంగారి కుటుంబానికి సంవత్సరానికి సుమారు అయిదువందల రాబడి. లక్ష్మిపెళ్ళి కయిన అప్పుమీద వడ్డీ మూడువందలు. కనక రాబడి అప్పులో చెల్లువెయ్యటంవల్ల అసలులో రెండువందలు మాత్రమే చెల్లుపడేది. పైగా ఈ

14)

కుటుంబానికి నెలకు ముప్పైఅయినా లేకుండా జరగదు. ఈ నాలుగువందలూ చిల్లరచిల్లరగా అప్పుతీసుకురావటంవల్ల వడ్డీద్వారా కలిసివచ్చేది ఉజ్జాయింపున సంవత్సరానికి, పాతిక రూపాయలుంటుంది. ఈ పాతిక రూపాయలకోసం ఒక అప్పులవాడికి మరో ఏడెనిమిదిమంది చిల్లరబాకీదార్లు జత అయినారు. కాస్త ఆలస్యమై డబ్బు అనుకున్ననాటికి అందక పోతే యింట్లో బియ్యానికీ, ఉప్పుకీ, పప్పుకీకూడా గెజగెజ లాడుకోవలసివచ్చేది. చివరకు ఏవిధంగా పరిణమించిందంటే, పొలంమీదవచ్చేది సంవత్సరమల్లా చేసిన బాకీలు తీర్చటానికి మాత్రమే సరిపొయ్యేది. హాయిగా డబ్బు దగ్గిరపెట్టుకుని జీవించే కుటుంబం చేబదుళ్ళమీద బతకవలసివచ్చింది. పెద్దబాకీలో మొదటిసారివేసిన అయిదువందల చెల్లుతప్ప మరోకానీ చెల్లుకూడా పడ్డపాపాన పోలేదు! శివం పినతండ్రి గారి లౌక్యానికి ఫలితం ఇదీ.

పొదుపుగా జీవించడమంటే డబ్బుకోసం ఇబ్బంది పడుతూఉండటమేనని విశ్వసించే శివంతల్లికి ఏర్పాటు సమ్మతమయింది. శివానికిది ఏమాత్రమూ రుచించలేదు. వాడు ఒక కానీపెట్టి కొనుక్కుతినాలన్నా, ఒక అణాపెట్టి సినిమా చూడాలన్నా "అదుగో నువ్వు సంసారం దివాలా తీస్తున్నావు!" అనేది తల్లి. "వెనక జరిగినట్టుకాదోయ్! ఇప్పుడు కాస్త ఒళ్ళు దగ్గిగపెట్టుకుని ఉండాలి!" అనేవాడు పినతండ్రి—లక్ష్మి పెళ్ళినాటినించీ ప్రపంచానికొక కొత్త శకం ప్రారంభమైనట్టుగా.

"ఉన్న బాకీలన్నీ నేను ఖర్చుచేసే శాస్త్రంలోనూ, అశాలంలోనూ తీర్చేటట్టున్నారు!" అని శివంఅంటే, పిన తండ్రి "నాలుగుకాళ్ల అశా! పదహారణాలు ఒకరూపాయి!" అని జ్ఞాపకం చేసేవాడు శివానికి. ఆయన ఆ జే మాటల మనిషికాదు.

*　　*　　*

1930 నడిమధ్యను ప్రపంచ ఆర్థికపరిస్థితులు తల్లక్రిందై నప్పుడు ధనాభావంవల్ల శివం తన ఇంటరు చదువు కట్టిపెట్టి గొంప చేరవలసి వచ్చింది. అప్పటికి వాడి బాకీలు దాదాపు అయిదువేలకు పెరిగిపోయాయి. కుంగిపోయిన ధరలవల్ల ఆస్తి నిలవకూడా అంతే అయింది. బాకీదార్లంతా తొందరపడు తున్నారు.

ఈ సమయంలో కనకయ్య శివానికి దేవుడల్లే అడ్డ పడ్డాడు—కనీసం అంతా ఆమాట అన్నారు.

నీ బాకీలన్నీ నేను తీరుస్తాను. ఏదైనా వ్యాపారం చేసుకునేటందుకొక అయిదువందలిస్తాను. నిపొలంయావత్తూ నాకు రాసివ్వు!" అన్నాడు కనకయ్య బావమరిదితో.

"ఏధర ప్రకారం!" అన్నాడు శివం.

"అందరూ తీసుకునేధరే!" అన్నాడు కనకయ్య.

"అందులో బావమరిదివై నువ్వు నాకు చేసే ఉప కారం ఏముంది?"

"లోకులు తినేది నేనే తింటున్నానని నువ్వే సంతోషించరాదూ?" అన్నాడు కనకయ్య. "మరొకరికంటే నాకింకా తక్కువకే ఇవ్వొచ్చునే. నేనే తినగూడనివాణ్ణా!"

"నువ్వు తినగూడనివాడివి కావు కాని నేను పెట్టలేనివాణ్ణి. మన బంధుత్వంలో కొంత లాభం పొందదగిన యోగ్యత మన ఇద్దరిలోకీ నాకే ఉంది. ఎవరినన్నా అడుగు" అన్నాడు శివం. వ్యవహారం మాటకారితనంలోకి దిగింది.

"ఈ ధరలు ఎప్పటికీ ఇట్లాగే వుండిపోవు. ఎప్పటికైనా లేవవచ్చు. కనక నువ్వు నాకు ఉపకారం చెయ్యదలిస్తే ఒక పనిచెయ్యి. ఈ బాకీదార్లు ఆగరు ఆ బాకీలన్నీ నువ్వే తీర్చు. నేను నీకు నోటు రాస్తాను. కావలిస్తే నా ఆస్తి యావత్తూ తనఖా పెడతాను. కాస్త ధరలు హెచ్చగానే నా ఆస్తి బాకీ ఉన్నంతవరకు నువ్వే తీసుకుందువుగాని" అన్నాడు శివం ఆఖరుకు.

నిజానికి కనకయ్యకిది ఇష్టంలేదు. ఆయన ఉద్దేశం బావమరిది ఆస్తి కలుపుకుందామనే. కాని ఆ మాట పైకి ఎట్లా అంటాడు? శివం చెప్పినదాని కాయన సరేనన్నాడు.

సమయానికి బాకీదార్లలో ఒకాయన శివానికి మంచి సలహా ఇచ్చాడు: "ఆస్తిమాత్రం తనఖా పెట్టకు. నీకు కాసు పుట్టదు. చాలా బాధపడతావు. మీ బావమరిది వ్యవహారం తెలిసినవాడే. నీ జుట్టు ఆయన చేతిలో చిక్కుతుంది. నీకు దమ్మిడీ కావాలన్నా ఆయనిస్తే కదా. లేకపోతే లేదు. జాగ్రత్త సుమా!" అని ఆయన శివంతో చాటుగా అన్నాడు.

కనకయ్య శివం బాకీలన్నీ తీర్చి, వాడిచేత నోటు రాయించి తాకట్టు దస్తావేజు రాయటానికి స్టాంపులు కొని తెచ్చినతరువాత శివం పెడకట్టైతనంగా "నోటుచాల్లే. మళ్ళీ ఇదికూడా దేనికి? డబ్బు దండగ!" అన్నాడు.

ఆశ్చర్యంతోనూ, కోపంతోనూ కనకయ్యనోట మాటరాలేదు. శివం ఆస్తి తాకట్టుపెట్టనని భీష్మించాడు. కనకయ్య విషయం చాలావిధాల వెళ్ళకక్కాడు. ఇందుకనే అయినవాళ్ళలో లావాదేవీ పనికిరాదన్నారు. మనిషిని నమ్మటానికి లేకపోయినతరువాత ఏం లాభమన్నాడు.

తాకట్టుకోసం ఇంత ఆరాటపడటంలోనే నీకు నాలో నమ్మకంలేదని తెలుస్తున్నది. నేను తాకట్టు పెట్టననటంవల్ల ఏదో గ్రహించినట్టు నటిస్తావేమిటి?" అన్నాడు శివం.

కనకయ్య తాకట్టు పెట్టి తీరాలన్నాడు. లేకపోతే ముందుముందు శివం చాలా పశ్చాత్తాపపడవలసి రావచ్చుననికూడా సూచించాడు.

శివానికి మండిపోయింది. తనుపడే పశ్చాత్తాపానికీ లక్ష్మికి సంబంధం ఉంటుందని వాడు గ్రహించగలిగాడు. కాని శివానికి భావాలను దాచగలశక్తి ఈ మధ్యకాలంలో అబ్బింది. వాడు నవ్వుతూ "పోనీ ఇంకో ఆరునెల్లాగు. బావా! ఈలోపుగా ధరలు లేస్తే సరేసరి లేకపోతే. మళ్ళీ తాకట్లూ కోకట్లూ దేనికి, పొలమే రిజిష్టరు చేసియిస్తాను" అని ఉపాయంగా కనకయ్యను సమాధానపరిచాడు.

"నీ యిష్టంవచ్చినట్టు ఏడుచుకో! చెబితే నేవాడికేమైనా చెప్పొచ్చుగాని—" అని తన సమ్మతి తెలియబరచి

కనకయ్య వెళ్ళిపోయినాడు. దగ్గరపడ్డ తండ్రి అబ్బికంకోసం లక్ష్మిమాత్రం ఉండిపోయింది.

* * *

ఆరాత్రి అక్కా తమ్ముడూ ఒకరి హృదయాలొకరికి విప్పిచెప్పుకున్నారు. హృదయాలు విప్పుకోవటమనేది తెలుగు దేశపు మధ్యమతరగతి కుటుంబాల్లో ఏకోదరులకు కూడా రోజూ సాధ్యమయ్యేపనికాదు. లక్ష్మితో మాట్లాడుతున్నప్పుడే శివానికి తెలుసును - మళ్ళా ఇటువంటి అవకాశం తన జీవితంలో లభించదని, మళ్ళా రేపటినించీ తనూ, లక్ష్మి మామూలు అక్కా తమ్ముళ్ళే. కాని ఈరాత్రి అపూర్వమైంది. ఇటువంటిది లభించనే లభించదు. దొరికినప్పుడు దాన్ని సద్వినియోగపరచాలి.

తనకు మొదటినించీ అక్కఅంటే యెంత ప్రాణమయిందీ, అది చూపించటానికి తనకు ఎట్లా సామర్థ్యమూ, సాహసమూ చాలకపోయిందీ. తన తల్లి పెంపకం తనకు ఎట్లా పాడుచేసిందీ, తను లక్ష్మికి ఎటువంటి భర్తా, ఎటువంటి జీవితమూ సంప్రాప్తించాలని కోరిందీ. లక్ష్మి వివాహం తనకు ఎట్లా బాధకలిగించిందీ, ఇప్పటికికూడా దాన్ని తలుచుకున్నప్పుడు తన గుండె ఎట్లా నీరయేదీ విపులంగా చెప్పాడు

"ఏమైనా చెప్పుకునేటందుకు గాని, ఆపేక్షచూపించేటందుకుగాని, నాకూడా ఒకరున్నా రనుకునేటందుకుగాని నాకు నువ్వుతప్ప ఇంకెవరున్నా రే!" అన్నాడు శివం.

లక్ష్మి ఎక్కువ మాటాడలేదు. తనకు సంబంధించి నంతవరకూ విధి తనకేమిస్తే దానితో పరిపూర్ణంగా తృప్తి పడటానికి సంసిద్ధురాలైనట్టు కనిపించింది. కాని దానికున్న అసంతృప్తీ, మనోవ్యథా శివాన్ని గురించేనని తమ్ముడికి తెలియచేసింది.

"నాదేమిటి? నేను దేనిలోకీ జమకాను. మొదటినించీ నేను దౌర్భాగ్యుణ్ణి వెనక్కు తిరిగి చూసుకుని నా జీవితంలో ఇది జరిగిందిగదా అని సంతోషించేటందుకు లేదు! నేను ముట్టుకుంటే బంగారం మట్టి అయింది. నే నేంచెయ్యబోయినా పొద్దు ఎదురైంది ఆకుక్కోబోయినచోట దెబ్బలాటలు పుట్టించినవాణ్ని కాను, నా బతుకేలంత!

"నీకేం ఖర్మమే! ప్రపంచంలో ఇంతమంది యోగ్యులు, సద్గురులూ, శౌక్షశుద్ధి అయినవాళ్ళు ఉన్నారు; నువ్వు ఏమూలో ఎవరికి పెళ్ళానివి కాదగవనీ, ఆ పల్లెటూళ్లో ఎందుకు పడవలసివచ్చిందీ? నీ బతుక్కువంటూ, ఇంటిచాకిరీ—మొదలూ, చివరా ఇంతేనా! ఒకపుస్తకాలు లేవు, సంగీతాలు లేవు, సర్కసులు లేవు, నాటకాలు లేవు, పదిహేనుమూపాయలు తెచ్చుకునే ప్లీడరు గుమస్తా పెళ్ళాంనీకంటెనయం. ఈ బస్తీగోడ్లూ, బస్తీ ఆనందమూ, సౌకర్యాలూ, ఇవన్నీ అనుభవిస్తుంది!" అన్నాడు శివం

లక్ష్మి మాట్లాడలేదు.

"ఎప్పుడో నీ మొగుడు కేదో గ్రోహం చేస్తాను." అన్నాడు శివం కాసేపు ఆలోచించి.

"ఏమిటది ?" అన్నది లక్ష్మి.

శివం ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా, "ఏమీ లేదుగానీ, దుర్మార్గుడు సిమీద చూపిస్తాడేమోనని భయంగా ఉంది!" అన్నాడు.

లక్ష్మికళ్లు మెరసినై. "ఏమిటాయన నామీద చూపించేది?" అన్నది. శివం ఒళ్ళంతా ఒక్కసారి పులకరించింది. ఆ క్షణంలో లక్ష్మిరక్తం శివం శరీరములో ప్రవహించినట్లయింది.

* * *

తన బావమరిదికి తెలియకుండా అతిరహస్యంగా శివం పొలమంతా అమ్మేశాడు. క్రయం జరిగిన ఆరునెల్లకు కొత్తపట్టాదారు పొలాన్ని స్వాధీనం చేసుకున్నాడు డబ్బంతా శివం ఎక్కడ పాతరేశాడో ఎవరికీ తెలియదు. ఈ వ్యవహారంలో శివానికి పినతండ్రి సహాయం పూర్తిగా ఉందని ఒకమాట పుట్టింది. మొత్తంమీద ఆ ఇద్దరికీ వెనక ఎన్నడూ లేని సఖ్యత ఒకటి ఏర్పాటయింది.

ఈ వార్త వినగానే లక్ష్మి, కనకయ్యా బయలుదేరి వచ్చారు.

"వెధవ, ఎంతపని చేశాడూ! వాడికింకా ఇల్లుందిగా, మీరు వెంటనే వాణ్ణికోర్టు కీడ్చి అది కాస్తా వేలంవేయించండి రూపాయికి పావలాలన్నా రాకపోతే? చెడిన సొమ్ముతోపాటే ఇదీనూ?" అన్నది లక్ష్మి. అప్రయత్నంగా చిన్నతనపు గొంతు తమ్ముడి విషయంలో ప్రయోగిస్తూ.

శివంమీద లక్ష్మి లేచిన లేవటం చూసి కనకయ్య ముగ్ధుడైపోయినాడు. దాని గొంతు తరువాత ఎన్నిరోజుల దాకానో కనకయ్యకెప్పు చెవుల్లో మోగుతూనే ఉంది.

"...నేను చచ్చాననుకునే ఈ పనిచేశావా?... నేను మళ్ళీ ఇంకా నీ మొహం చూస్తానా? ఇంత ద్రోహంచేసి నువ్వు నా గడప తొక్కుతావా?... వెధవపనిచేస్తావా? నేనివ్వలేనని ఆ మహారాజు కాళ్ళమీద పడలేక పోయినావా! నీ ముష్టినోటు చించి నీ మొహాన ఎన్నడో పారేసేవారుగా! ...ఈ ముష్టి అయిదువేలు నీచేత గడ్డి తినిపించిందిగాని ఆయన కిదో లెక్క అనుకున్నావా?..."

అక్షరాలా కనకయ్య అభిప్రాయాలు కావుగాని గొప్ప మాటలు! కనకయ్య భార్య ప్రవాహానికి అడ్డుపడలేక చూస్తూ ఊరుకున్నాడు. తనకు అయిదువేలు లెక్కలేకేం గాని లక్ష్మిమాటలు వినటానికి మహాశ్రావ్యంగాఉన్నై.

మౌనంగా అక్కగారి ఉపన్యాసం వింటున్న శివం చెవులకుకూడా అవి శ్రావ్యంగానే ఉన్నసంగతి, పాపం, కనకయ్య ఎరగడు.

తరువాత నారింజలను చూసుకుంటే, ఎంత వెతికినా, శివం రాసిన నోటు కనిపించలేదు. అది పూర్తిగా అదృశ్యమయింది.

పది సంవత్సరాలపాటు లక్ష్మి; శివం ఒకరినొకరు చూసుకోలేదు. ఆఖరుకు లక్ష్మి మంచానపడి అవసానదశలో

ఉండగా భర్తను దగ్గిరికి పిలిచి "ఒక్కసారి మా తమ్ముడికి కబురు చెయ్యండి!" అన్నది.

"వాణ్ణా—?" అన్నాడు కనకయ్య ఆశ్చర్యంతో.

"పిలిపించండి! ఇక నేను బతకను!" అని బతిమాలింది.

కనకయ్య సరేనన్నాడు. పదిసంవత్సరాలు తనను వంచించిన భార్యను ఒక్కసారి వంచించిన కనకయ్య భగవంతుడి దృష్టిలో పతితుడై ఉంటాడు!

ఇంకో అయిదునిమిషాలకు ప్రాణం పోతుందనగా ఒళ్ళు తెలిసి "వచ్చాడా?" అన్నది లక్ష్మి. శివం రాలేదని చెప్పాడు.

"రాడు!—వాడు రాడు! నేనే రావద్దన్నాను!" అని లక్ష్మి కళ్ళు మూసుకుంది. ఆమెను వెంటనే మైకంలోనే ఆమె ఆత్మ శరీరాన్ని వదిలింది.

# సినిమాసరదా

---

నన్ను వెంటనే బయలుదేరి రమ్మని రంగనాథం టెలిగ్రాం ఇచ్చాడు. అది చూసి మా ఆవిడ చాలా సంతోషించింది.

“పిచ్చిదానా, నీకు రంగనాథం సంగతి తెలీదు, వాడంత మంచివాడులేడు. వాడంటే నాకిష్టంకూడా అనుకో. కాని వాణ్ణి నమ్మటంకన్న బుద్ధితక్కువపనిలేదు. ఆకాశానికి నిచ్చెనవేసి, అది ఆనిందో లేదో చూడకుండా గబగబా మెట్లెక్కేరకం. వాడికి తగిలిన బొప్పెలు మామూలు మనుషులకు తగిలితే వాళ్లు ఈసరికి సన్యసించటమో రాజ్యాలేలటమో చేసిఉందురు. రంగడు అనుభవంద్వారా నేర్చుకునే బాపతుకాదు. ఈ టెలిగ్రాం నమ్మివెళ్లితినా సిద్దెన్న మాచారం వెళ్లినట్టవుతుంది.” అని మా ఆవిడ ఉత్సాహం పాడు చెయ్య ప్రయత్నించాను.

కాని మా ఆవిడ అంత సులభంగా నిరుత్సాహపడలేదు. నిజానికి రంగడి లక్షణాలు కొన్ని మా ఆవిడలో

కూడా లేకపోలేదు. మేలెంచిగాని కీడెంచదు. ఒక మనిషికి కలిగే అనుభవాలలో కొంతవరకైనా ఆ మనిషి ప్రవృత్తి ప్రతిబింబిస్తుందని తెలుసుకోదు. "అదివరకట్లా అయింది. ఈసారి ఇంకోవిధంగా కావచ్చు." అనే ధోరణిలో ఉంటుంది. ఏక్షణాన ఏదిజరిగినా జరగవచ్చుననే వాళ్ళనే భరించటం కష్టం. ఏక్షణాన మేలు జరిగినా జరగవచ్చుననే దురాశగల వాళ్ళని భరించటం మరీకష్టం. మా ఆవిడ ఈరకం. రంగడుకూడా అంతే. పైపెచ్చు వీళ్ళిద్దరికీ నా తెలివితేటల్లోనూ, శక్తి సామర్థ్యాల్లోనూ అంతులేని నమ్మకం నాలో ఈఇద్దరికీఉన్న విశ్వాసం ఏ ధనికుడికో ఉంటేనిరుద్యోగంతో బాధపడకుండా నాభార్యకూ పిల్లలకూ ఇంతతిండయినా పెట్టగలిగిఉండును. నే నామాట అన్నప్పుడల్లా మా ఆవిడ, "రోజులెప్పుడూ ఒకటిగానే ఉంటాయా ఏమిటి? రేపు మీరే అందరికన్నా ఎక్కువ సంపాదించవచ్చు." అనేది. కదిలిస్తే కంపంతా కదులుతుందని నే నెవరెవరికన్న ఎక్కువ సంపాదించవచ్చునో అడిగేవాణ్ణికాను. రంగడు కూడా నాతో, "ఏమిట్రా ? ఈ సంపాయించే వాళ్ళంతా నీకన్న మొనగాళ్ళా ?" అనేవాడు.

కాస్తో కూస్తో బుద్ధిమాంద్యంగలవాళ్ళకు తప్ప నాలో విశ్వాసం కుదరదు కాబోలని నే నొక్కొక్కసారి భయపడుతూ ఉండేవాణ్ణి. ఇంకో విచిత్రం ఏమిటంటే నాలో ఇంత విశ్వాసంగల ఈ యిద్దరూ నా నిర్ణయాలను కాస్తయినా గౌరవించేవాళ్ళుకారు. ఏదిచెయ్యాలో వాళ్ళు చెప్పే

వాళ్ళు, ఎట్లా చెయ్యాలనేది నాకు వొదిలిపెట్టేవాళ్ళు. ఎట్లా చెయ్యాలో తెలిసిన వాడికి, ఏది చెయ్యాలనేది ఎందుకు తెలియదో వాళ్ళకే తెలియాలి. ఇంత అసాధారణ ప్రజ్ఞావంతుణ్ణయిన నేను ఈ యిద్దరి గార్డియన్‌షిప్పులోనూ ఉంటూ ఉండవలసివచ్చేది.

నా మద్రాసు ప్రయాణానికి మా ఆవిడ టికెట్టు కొనడం తరవాయిగా అంతా సిద్ధం చేసింది.

"అదికాదే! ఆ బ్రాహ్మడు కార్డుముక్కతో పొయ్యే దానికి ఉభయకుశలోపరి అగ్గంటు వైరిచ్చాడుగాని ఆ డబ్బు నాకు పంపితే రైలుచార్జీకయినా ఉండేదికద! ఇప్పుడు పోవటానికి డబ్బేదీ?" అన్నాను.

"నా నాను తాకట్టుపెట్టండి కాసులపేరుతోపాటు కలిపి తీసుకోవచ్చు." అన్నది మాఆవిడ.

"ఇదివరకు నీ సొమ్ము దుర్వినియోగం చేసింది చాలదూ?"

"మీదంతా తల్లకిందులు వాదన. అవసరమైనదానికి ఖర్చుపెట్టేది దుర్వినియోగమంటారు. ఊరికేకూర్చుని తిన్నది సద్వినియోగమంటారు. నా నగలు తాకట్టుపెట్టటం కొత్తయినట్టు మాట్లాడతారేం?"

"అదికాదే! ఈ వెధవ సినిమా తీయటమేమిటి? వాడికీ నాకూ సినిమా తియ్యటం ఏమిటో ఎట్లాతెలుసు?

వీణ్ణి నమ్మి ఈవ్యవహారంలో దిగేవాడు వాడెంతటివాడను కోవాలి? నేను నేర్చుకోవటానికైనా ఉండదే?"

"చాలెసురూ! మీరేవేవో దిక్కుమాలిన కథలన్నీ రాయటం లేదూ? సినిమాకు రాయలేరా యేం? అన్నీ చూసొచ్చినట్టు రాస్తారే? సినిమాకేం తెగులొచ్చింది?"

"ఎట్లా అయినా సినిమా అన్న తరువాత కొంచెం కష్టంకాదూ? దానికేవో ఏముస్తయి" అన్నాను అయోమయంగా.

"ప్రతి సినిమా చూసివచ్చి విమర్శిస్తారే? అక్కడ బాగాలేదు, ఇక్కడ బాగాలేదు అంటూ? ఇన్ని సినిమాలు వచ్చినా ఒక్కటీ మీకు నచ్చదుగదా, ఇంకేం, వెళ్ళి అన్నిటికన్న మంచి సినిమా తియ్యగూడదూ?"

"వంటలో తప్పులు పట్టటమూ, వండటమూ ఒకటేనా?"

"చూస్తుంటే అదే తెలుస్తుంది. మీరు నేర్చుకోలేని విద్య ఉందా ఏమిటి?"

ఎంత గొప్ప నాకు!

"అదికాదే! అసలు సినిమాలైను చాలా ఛండా లపుది అందులోకి రకరకాల వాళ్ళు దిగుతారు. తాగుడూ వ్యభిచారమూనూ. అంతా మాలకూడు!" అన్నాను.

"మన బంగారం మంచిదైతే!... చెడిపోదలిచిన వాళ్లు సినిమాలోనే పోవాలా?"...

మొత్తంమీద మా ఆవిడ గట్టిపట్టే పట్టింది. దొరికిన అవకాశాలు పోగొట్టుకుంటే ఎట్లాగన్నది. నా బద్ధకం తప్ప ఇంకేమీ లేదన్నది. కాని తీరా వెళ్ళితే ఏం జరుగుతుందో నాకు తెలుసు. శతవిధాల ఏమీ ఉండదు. నాలుగు రోజులపాటు కుక్కలల్లే నేనూ రంగడూ కలిసి పట్నమంతా తిరిగి, చివరకు తిండికూడా డబ్బుచాలక, రైలు చార్జికి కూడా ఎవరిదగ్గరో అప్పు చెయ్యవలసివస్తుంది. అట్లాకాక రంగడు నిజంగానే డబ్బుగలవాణ్ణి పట్టినట్టయితే కొంతకాలం వాడిడబ్బు తగలేసి, చివరకు పిక్చరుతీసే అసలు నాధుడు దొరక్క ఎవరిదారినవారు వెళ్లవలసి వస్తుంది. ఒకవేళ దారితప్పి పిక్చరు తీయటమే ఉన్నా అది అధమచిత్రాల్లో ప్రధమ చిత్రంగా తయారై అందులో నేకూడా ఉన్నానని చెప్పుకోవటానికి నామర్ధా అవుతుంది. నాకు దరిద్రమంటే భయమే. అయినా, అంతకన్నా అసహ్యమేమంటే మోసం లేకుండా అమాయకుడి దగ్గరా డబ్బు కాజెయ్యటం. నిజంగా రంగడు సినిమా పిక్చరు తీయించటమే జరిగి, అందులో నేను డబ్బు సంపాదించటంకూడా జరిగిందా ఈ రెండు పద్ధతుల్లో ఏదో ఒకటి తప్పదు.

అయినా మా ఆవిడ పోత్తిడి భరించలేక పదిహేను రూపాయలు చేతబట్టుకుని మద్రాసు బయల్దేరాను.

* * *

నా రిప్లయి అందింది. రంగనాథం నా కోసం సెంట్రల్ ప్లాట్‌ఫారంమీద ఎదురు చూస్తున్నాడు. ఎందుకు బయల్దేదానా అని పశ్చాత్తాప పడుతూనే వచ్చానుగాని, నేను రావటంవల్ల వాడికి కలిగిన సంతోషం చూస్తే రావటం మంచిదే అయిందనిపించింది. డబ్బు పెట్టుబడి చేసే బసవయ్య పట్నంలోనే ఉన్నాడనీ, మూడరన్ హోటల్లో బస అనీ, త్వరలోనే లాడ్జి అద్దెకు తీసుకోబోతున్నారనీ రంగడు చెప్పగానే నా సంతోషం మరింత అయింది. వద్దంటున్నా వినకుండా నన్ను టాక్సీలో ఎక్కించి రంగనాథం మూడరన్ హోటలుకు తీసుకుపోయినాడు.

దారిలో వాడు నాకింకా కొన్ని కొత్త విషయాలు కూడా చెప్పాడు. అందులో ముఖ్యమైన అంశమేమంటే మనవాడికి బసవయ్యతో నేరుగా లావాదేవీలు లేవుట. బసవయ్య ఏకపుత్రుడు శ్రీనివాసులుట చక్రం తిప్పుతున్నది. బసవయ్య వేరుశనగలోనో పొగాకులోనో పెద్ద వ్యాపారం! ఎగుమతి వ్యాపారం – చేసి రెండో మూడో లకారాలు చేర్చాట్ట తన ముద్దుల కొడుకు కోరిక తీర్చలేక ఒకటంటే ఒకటి సినిమా ఫిలిముతీసి అందులో అసలు! లాభం ఉన్నా లేకపోయినా-తిరిగివస్తే ఆ వ్యాపారంతో ముద్దుగా సీనుల్ను ఏర్పాటుచేసి తనదారిన తాను యథేచ్ఛగా వేరుశనగా, పొగాకూ అమ్ముకుందామని తీర్మానించాడుట బసవయ్య. రంగడు చెప్పే కబుర్లనుబట్టి సీనాయి పోరుపారం కణుపు దాటలేకపోయినాడనీ, పదహారో యేటనే ముండా ముతకా పెట్టాడనీ, సినిమా ఆలోచనలతో పోల్చిచూస్తే ఈసినిమా

తియ్యటమనేది అత్యుత్తమంగానూ అతి నిరపాయంగానూ బసవయ్యకు తోచిందని నేను అర్థం చేసుకున్నాను.

"అంతా బాగానే ఉందిగాని సీనాయికి నువ్వెల్లా దొరికావు? నీకన్న అనుభవజ్ఞుడు లేకపోయినాడా?" అన్నాను.

"వాళ్ళ మొహం అనుభవం! అనుభవంకన్న ముఖ్యంగా కావలసింది మెదడు. ఇప్పుడు తీసే పిక్చర్లకంటె మనం చాలా మంచిపిక్చర్లు తియ్యవచ్చు" అన్నాడు రంగడు.

"మనం ఎవరు?" అన్నాను.

"నువ్వూ నేనూ, కావలిస్తే సీనునుకూడా వేసుకో. వాడుకూడా వుండనే వుంటాడాయె. వాడు మనం చెప్పినవి కాదనడు. నువ్వొక్కడివి చాలవుట్రా?"

నాకింటిదగ్గిర ఉన్నట్టే అనిపించింది.

"మీ సినాయి చెప్పినట్టు మనం వినాలిపొస్తేనో?" అన్నాను.

"వెధవను పీక పిసికి పారెయ్యనూ? అంతా నువే చూసేట్టు వాడితో ముందే చెప్పాను."

"నీ తెలివి తెల్లారినట్టే ఉంది. నాకుమాత్రం ఏం తెలుసు?"

నేనిమాట అనేసరికి రంగడు పులినిచూసినట్టయి

"నీపుణ్యముండుంటుంది ఆమాటమాత్రం సేనాయిదగ్గిర అనకు. నీకంతా తెలుసునని వాడితో చెప్పాను. నిష్కారణంగా ఇద్దరిపరువూ పోతుంది," అన్నాడు.

రంగడినెత్తిన ఒక్కటిపెట్టి, నాదారిన నేను టాక్సీ వెనక్కు తిప్పుకు పోదామనిపించింది

"నేనే యేం చేస్తానని వాడితో చెప్పావు?"

"కథా డయిలాగ్సు రాయలేవూ?"

"అంతమాత్రమే అయితే ఎలాగో ఏడుస్తాను. నేను తప్పు చేస్తే డైరెక్టరుగాడుంటాడుగా సరిదిద్దటానికి?"

"నువే డైరెక్టు చేస్తావన్నానే."

"నేనా, నీకేమైనా మతిపోయిందా యేం?"

"చాల్లేరా నీ నంగివేషాలూ! వెధవది తెలుగు పిక్చరు డైరెక్టు చెయ్యలేవా? నువు నాటకాలాడించలా? రిహార్సల్సు చేయించలా? అడిగే వెధవలేడుగాని నేను అమాంతం పదిపిక్చర్లు డైరెక్టుచేసి పారేద్దునే!"

"పనివొద్దు. ఈ ఒక్కటీచెయ్యి నీపుణ్యం వుంటుంది" అన్నాను

"సరే, అంతిగా అయితే డైరెక్షను విషయం తరవాత మెల్లిగా సేనుతో నేచెబుతాగాని, ముందరిగా నువు చాతకాదని అనెయ్యకు," అన్నాడు రంగడు.

"ఇంకేమం చేస్తానన్నావు?" అన్నాను.

"ఇంతే. ఇంకేముంది?" అన్నాడు రంగడు. వాడింకేదో దాస్తున్నాడని నాకు సందేహం కలిగిందిగాని తరిచి అడగ లేదు. ఎందుకంటె వాడి మొహంచూస్తే జాలివేసింది. నేను దైరక్షను చెయ్యలేనురా బాబూ, అంటే చెయ్యనన్నట్టు అర్థంతీసుకుని, తనను నేను నమ్మించి నడిసముద్రంలో ముంచినట్టు వాడు భావించుకున్నాడు. వాడి మొహంచూస్తే నాకా సంగతి స్పష్టమయింది. వాణ్ణి పుస్తకం చదివినట్టు చదివెయ్యగలను.

మనని అభిమానించేవాళ్ళు లేకపోతే లేరని ఏడుస్తాం గాని, వీళ్ళు మనమీదవేసే భారంచూస్తే ఒక్కొక్కసారి కిరీకన్న అజ్ఞాతవాసం మేలనిపిస్తుంది.

* * *

హోటల్లో ఒక డబుల్ రూములో బసవయ్యా కొడుకూ వుంటున్నారు. దాని పక్క గదిలోనే ఒకసీటు మనవాడు, రంగనాథం ఆక్రమించాడు. రెండోసీటు ఖాళీగానే వుండటంవల్ల దాన్ని నాకిచ్చేశారు. టాక్సీలో నుంచి నేనూ, రంగడూ దిగుతుండగా బసవయ్యగారు తన గది గుమ్మందగ్గిర నిలబడి మీసాలు తుడుచుకుంటూ నన్ను చూసి తలఆడించి, "వచ్చారా?" అని గంభీరంగా అడిగి, మరోమాటలేకుండా గదిలోకి వెళ్ళిపోయినాడు. ఆయనకు యాభైయేళ్ళుంటై. చేతులకుమురుగులున్నై. వెనక ముచ్చట ముడి.

కాఫీతాగి, గడ్డంగీక్కుని, నేను స్నానంచేసి వచ్చే సరికల్లా సీనుగాడు ఎక్కడినుండో ఐచ్చి రంగడితో పది మంది పెట్టుగా మాట్లాడుతున్నాడు.

"మీరు రారేమో ననుకుని భయపడ్డాం. మీ కోసమే అంతా ఆపిఉంచాం. కథఏమైనా ఆలోచించారా?" అని ఆత్రపడ్డాడు సీనాయి.

"ఉండరా! ఇప్పుడేగద వాడొచ్చింది," అని రంగడు వాణ్ణి కోప్పడ్డాడు.

సీనాయి ఆత్రం వర్ణనాతీతం. వాడికున్నంత సినిమా వెర్రి ఎవరికీ ఉంటుందనుకోను. సాధ్యంకాదుగాని ఆ సాయం త్రానికే వాడికి సినిమా తీసి పారెయ్యాలని వుంది. ఆమాట నోటంట అన్నాడు కూడాను.

"నాటకం ఆడినంతసేపేగదా సినిమాకూడా ఆడేది? ఒక్కరోజులో నాటకమల్లే ఎందుకు తియ్యకూడదో?"

తాను తియ్యబోయే చిత్రంగురించి మాట్లాడటాని కేమీ లేకపోతే ఇతర సినిమాకంపెనీలను గురించీ, చిత్రా లను గురించీ, మాట్లాడేవాడు. చెవికోసిన పిట్టల్లే ఒకటే వాగుడు. మేం భోజనం చేసేలోపుగా తను పుట్టింది లగా యతు చూసిన మూవీలూ, టాకీలూకూడా వర్ణించాడు. ఆ తరవాత ప్రస్తుతం తీస్తున్న చిత్రాలన్నిటిలోనూ ఎవరెవరు నటిస్తున్నారో, ఎవరెవరు కామెరాలు తిప్పుతున్నారో, సౌండుకార్డు చేస్తున్నారో, ఏయే స్టూడియోల కెవరెవరు

పి త్తుందార్లో అన్నీ చెప్పాడు. వాడు ఇంత సంభాషణమధ్యా అయిదునిమిషాలకొకసారి గగ్గయ్యను గురించీ రామతిలకాన్ని గురించీ చెప్పటంచూసి వాళ్ళిద్దరూ వాడికి అభిమాన తార లేమో అనుకున్నా. నే ననుకున్నది నిజమేగాని దానికి కారణం నేనూహించినదికాదు. కలకత్తాలో సావిత్రి చిత్రం తీసేటప్పుడు సీనుగాడి స్నేహితుడక్కడేవుండి ఒకరోజు షూటింగు చూశాడుట.

సీనుగాడి సంభాషణలు రెండున్నర నిమిషాలకన్న భరించటానికి టానిక్కుల సహాయం అవసరం. భోజనం చెయ్యగానే నిద్రపోవటం అలవాటని వంక పెట్టి తప్పించు కున్నాను.

మధ్యాన్నం మూడుగంటలకల్లా సినిమాకు వెళ్ళే ప్రోగ్రాం దగ్గిరలో వెస్టెండులో ఇంగ్లీషు సినిమా వుంది. దానికి వెళ్ళాక. ఇంటర్వల్లో సీనాయి ఇంగ్లీషు సినిమాల్లో లోపాలమీద ఉపన్యాసం ప్రారంభించాడు అందరూ మా కేసి చూస్తున్నారు. నాకు సిగ్గేసింది. చర్చ సీనాయికీ, రంగడికీ వొదిలేసి నేను వాళ్ళవెంట రానట్టు మొహం పెట్టి దిక్కులు చూడసాగాను.

సినిమా అయిపోయే టైముకి సీనాయి నన్ను "ఏమోయ్" అని పిలుస్తున్నాడు.

"ఇప్పుడేంచేస్తాం?" పోయి ఎక్కడన్నా తాగు దామా? జలాన్సు ముందు బ్రాందీ లేకపోవటం ఏమి లోటోయ్?" అన్నాడు సీనాయి.

"నాకు లైమ్‌జూస్ తప్ప సయించదు" అని చెప్పాను.

"నాన్సెన్స్! మా వెంట రాకపోతే నేనొప్పను. చెప్తే వొట్టే," అన్నాడు సీనాయి

"మనవాడికూడా అలవాటుందిలే, అప్పుడప్పుడూ!" అని రంగడు సీనాయికి ప్రోత్సాహం యిచ్చాడు.

సీనాయితో సావాసమంటే నాకెంత వెగటుగా వుందో రంగడు అర్థంచేసుకోలేడు. రంగడు మంచివాడు. సర్వసముడు నేనంత నిష్కల్మషహృదయుణ్ణికాను. కపటిని. ఎంతో విచారించిగాని నేను స్నేహంచెయ్యను. నాకిష్టంలేని మనిషిని అంతదూరాన ఉంచటానికి నా అంతరాత్మ అంగీకరిస్తుంది. సీనాయితో స్నేహంచెయ్యటం నాకిష్టంలేకపోగా, వాడు నాస్నేహం సంపాయించే పద్ధతులుకూడా నాకు రుచించలేదు.

"నేను రానులే, మీరిద్దరూ వెళ్ళండి. నాకు కొద్దిగా పనికూడావుంది." అని వాళ్ళ జవాబుకోసం చూడకుండా సాగివెళ్ళాను.

ఆరాత్రి నేనింటికి వెళ్ళేసరికి రంగడు ఒక్కడే ఉన్నాడు. సీనాయి ఏమైనాడని అడిగితే, "ఆం వెధవ!" అని సమాధానం చెప్పాడు. అంటే అర్థమేమిటంటే ఏ కొంపలోనో దూరాడని బయటపెట్టాడు.

"వీడి ఈ వేషాలు సమర్థించా వీడిస్నేహం సంపా

దించావ్? నువ్వుకూడా ఏదో కొంపలో దూరలేకపోయి నావా?" అన్నాను.

"ఛీ, ఛీ! నేను వాణ్ణి నిరుత్సాహపరచబట్టి ఇప్పుడు నయంకాని, నేను లేకపోతే మరీ అన్యాయంరా!" అన్నాడు.

"నాకా తేడా కనిపించలేదు," అన్నాను. సీనాయిని అంతకుపూర్వం ఎరక్కపోయినా.

పాపం, రంగడికి నామాట వేదవాక్యం. ఇవాళ వరకూ వాడు సీనాయిని అసహ్యించుకుని ఉండడు. నేను అడుగుపెట్టగానే వాడు సీనాయిని గురించి నాకోసం తన అభిప్రాయం మార్చుకోవటం ప్రారంభించాడు.

*　　　*　　　*

రంగవాతెసినిమాంతిసినాతీయకపోయినా ప్రస్తుతంవీళ్ళు పెడుతున్న ఖర్చుచూస్తే నాకు మండిపోయింది. మానలుగురికీ రోజుకుపదిహేనుపాయలచొప్పున హోటలువాడుకొజేస్తున్నాడు. నెలకు ముప్ఫైరూపాయలుపారేస్తే మంచిఇల్లు దొరుకుతుంది. పూటకు నాలుగణాలకు ఎక్కడైనా భోజనం దొరుకుతుంది. టిక్కెట్లు పుస్తకాలు కొంటే ఇంకా చవుక. ప్రస్తుతంమాకు అర్జంటు పనులేవీలేవు. అయినా ఇల్లుకదిలితే టాక్సీ. బస్సు మీదో, ట్రాముమీదో పోగలిగిన చోట్లకుకూడా టాక్సీలే. సినిమాకుపోతే మూడురూపాయిబేడ టిక్కెట్టుకు తక్కువ కొనటం

లేదు. ఇదికాక రోజూ తాగుడు, రోజూ ముండలు, పేటికని సీనుగాడు ఎంతఖర్చు పెడుతున్నాడో నాకు అంచనా లేదు. గడిచిన రెండు సంవత్సరాలలోనూ ఏనెలా నేను పాతిక రూపాయలు మించి ఖర్చుపెట్టి వుండలేదు. రోజుకు పదీ పది హేను తక్కువ కాకుండా దుర్వ్యయం అవుతుంటే చూస్తూ వూరుకోవటం నాకు చాతకాలేదు. ఒకరోజు సీనాయి నన్నూ రంగణ్ణీ వెంటపెట్టుకుపోయి. ఒకసిల్కుతాను బేరంచేశాడు. కొన్నాడు, మాముగ్గురికీ మూడు రెళ్ళు ఆరు చొక్కాలు కుట్టించడానికి టెయిలరుదగ్గిరికి ప్రయాణంకట్టాడు. ఆ అవ కాశం తీసుకుని సీనాయికి మంచి లెక్చరిచ్చాను.

"నేను చాలామంది వ్యాపారస్తుల్ని చూశాను. వాళ్ళలో బాగా బతికేవాళ్ళనీ చూశాను. కాని వాళ్లెవరూ ఇట్లా పెట్టుబడి డబ్బు మంచినీళ్ళుగా వాడరు. ఏమైనా సర దాలుంటే లాభాలతో తీర్చుకుంటారు. నువుఖర్చుచేస్తున్నది. ఎవరిడబ్బోకాదు నీదే:" అన్నాను.

"డబ్బంటే చేదయినట్టు మాట్లాడుతున్నావే?" అన్నాడు సీనాయి. నాదొంగెత్తు బయటపెట్టిన వాడల్లే.

"నాకు డబ్బు చేదుకాదు. నాకోసం నువు ఖర్చు పెట్టేదంతా రొక్కంగా యిచ్చుకుంటే దానితో నాఖర్చులు గడుపుకోగా నాభార్యాబిడ్డలనుకూడా హాయిగామేపగలను. ఖర్చయే డబ్బుకు క్రమమైన ప్రతిఫలం రావటంలేదని విచా రిస్తున్నాను." అన్నాను.

"మనకు రేపుసినిమామీద లక్షరూపాయలు లాభం

వస్తుయి, ఏం ఖర్చుచేస్తే? మనం చెయ్యబోయ్యేది అంత అడవా వ్యాపారమూ? దర్జాగా, పెద్దెత్తుగా ఉండాలి. రూపాయలు పారేసేవాడికే రూపాయలు. అణాపైస లెంచే వాడికి అణాపైసలే." అన్నాడు సీను ప్రపంచాన్ని కాచివడబోసిన వాడల్లే.

"ఏదో తోచింది చెప్పాను. ఇందువల్ల నాకు ఒరిగే దేమున్నది?" అన్నాను. నేనెంత చెప్పినా వినక దర్జీవాడిచేత నా కొలతలుకూడా తీయించాడు

తర్వాత నాతో రంగనాథం రహస్యంగా, "ఏమిరా వాడికి అటువంటి సలహా రుచిస్తుందనా? వాడిడబ్బు వాణ్ణి తగలేసుకోనీ, నీదేంపోయింది? నాదేంపోయింది?" అన్నాడు

"తీరా పిక్చరు తియ్యటానికి డబ్బులేకపోతే?" అన్నాను.

"ఆ సంగతి వాడికి తెలీదా?"

వాడికి మంచీ చెడూ తెలీదనేగా నువ్విప్పుడు నాతో అన్నదీ?"

"పోదూ, నీ కేవడు చెప్పగలడూ? నీతో ఎప్పుడూ ఇంతే అందరికీ బుద్ధిచెప్పాలంటావు. నీకేం వొరుగుతుంది. అందుకే నిన్నుచూస్తే ఎవరికీ ఇష్టంవుండదు. నువుచెప్పి ఎవణ్ణన్నా ఎప్పుడన్నా బాగుచేశావా?"

ఆలోచించాను. ఆ చివరిముక్కలో అబద్ధం వస

పించలేదు. కాని మనుషులు మారకపోవటం నా అంత రాత్మకి రుచించలేదు. నా ఆదర్శమూ, విశ్వాసాలూ అన్నీ మనుషులు మారగలరనే విశ్వాసంమీదే ఆధారపడి ఉన్నట్టుగా తోచింది.

"ఇతరులను బాగుచెయ్యకపోవటం నా అసమర్థత అయివుండాలి. అంతేగాని బాగుచెయ్యటం అసాధ్యమైకాదు నన్ను ఆవిద్య నేర్చుకోని, ఇంకోడు తప్పుచేస్తున్నట్లు నిష్క ల్మషమైన నీ అంతరాత్మకు తోస్తున్నప్పుడు ఊరుకుంటే నువ్వేం మనిషివి? నా తప్పులు ఎవరో దిద్దకపోయినట్టయితే నేనేస్థితిలో ఉండేవాణ్ణి?" అన్నాను.

"ఆసంగతివేరు. నువ్వు నేర్చుకోగలవేమో, సీనాయి నేర్చుకోలేడు. వాడు నిన్నుగురించి ఏమన్నాడో తెలుసా? 'ఇటువంటివాడు సినిమా ఏం తీస్తాడు? పదిరూపాయల నోటు చూసి దడుచుకునేవాడు!' అన్నాడు. నేను చివాట్లు పెట్టా ననుకో. అయినా నువ్వు డబ్బువిషయం నిర్లక్ష్యంగా ఉన్నట్టు కనిపిస్తే వాడికి కాస్త ధైర్యంగా ఉంటుంది ... తరవాత డైరక్షను విషయంకూడా వాడితో మాట్లాడా. నువ్వే డైరెక్టుచెయ్యాలనుకున్నావని చెప్పేటప్పటికి వాడు కంగారు పడ్డాడు. ఏంచేసేదీ? "ఒకకోతకోశా. నువ్వు సంభాషణలూ, పాటలూ రాస్తే మరొకరు డైరెక్టు చెయ్యటం బావుంటుం దనీ, ఒకమనిషే అన్నీ చెయ్యటం కుదరదనీ చెప్పా. పేరున్న డైరెక్టరును తెస్తే ఏ రెండుమూడువేలో ఇవ్వాలిసి వుండదా అన్నాడు. అంటే అఖర్చు మేం వేసుకోలేదు.

అందుచేత నే నన్నానుకదా "ఎవరో అసిస్టెంటు డైరెక్టరును చవుకలో తెచ్చి వాడిమీద నిన్ను పెడితే వాణ్ణి డైరెక్టరు చేసినట్టువుంటుంది, నువు వెనకవున్నావన్న ధైర్యమూ వుంటుంది." అన్నాడు రంగడు.

"ఎవరీ అసిస్టెంటు డైరెక్టరు? దొరికాడా? పతకాలా?

"దొరికాడులే వెయ్యిరూపాయలకు మాట్లాడాం. ఇవాళ రెండువందలు అడ్వాన్సిచ్చి బుక్ చేస్తున్నాం.

"మీసాహసం చూస్తే అజ్ఞానం వెనక లేందీ ఇంత సాహసం ఎవర్కైనా ఉంటుందా అనిపిస్తున్నది. మనేవరికీ సినిమాలు తీయటం తెలియదు. డబ్బిచ్చయినా అనుభవం వున్నవాణ్ణి పెట్టుకోవద్దుట్రా? డైరెక్టరుగా పెట్టుకునేవాడి కేమైనా తెలుసునో తెలియదో నిర్ణయించేది నువ్వా. సీనాయి నూనా? పోనీ విరారయినా వాణ్ణి పరీక్షించావా? లేదు. డైరెక్టరంటూ ఒకడికి పెత్తనం ఇచ్చి వాడిమీద నన్ను అధికారిగా పెడతారా? నేను డైరెక్షనుకు పనికిరానో అంటుంటే డైరెక్టరుమీద అధికారం చలాయించటానికి పనికివస్తానా?

రంగడు, పాపం, నన్నిక భరించలేకపోయినాడు.

"మేము ఏది చేసినా నీకు నచ్చదు. నువు చెయ్యావు. ఎట్లారా నీతో?

వాడి అజ్ఞానాన్ని బలపరచని కారణంచేత నేను రంగడికెంత ప్రతిబంధకంగా తయారయినానో నేనూహించు

కోగలిగాను. వాణ్ణిచూస్తే జాలివేసిందిగాని ఆమోదించటం నాతరంకాలేదు.

"మీా యిష్టంవచ్చినట్టు ఏడుచుకోండి. మధ్య నాదేం పోయింది?" అని తాత్కాలికంగా అస్త్రసన్యాసం చేశాను.

*　　*　　*

ఆనాడు డైరెక్టరు మాగదికి వచ్చాడు. మాట్లాడు తుంటే నాకు అతను పోట్టిపోచికోలు రామన్నగా కనుపించాడు. వాడు కొన్నివిషయాల్లో సీనుగాడికి దీటయినవాడే. వాడు అయిదునిమిషాల్లో అరడజను పిక్చర్లుతీసి ఆరులక్షలు లాభంచూపించాడు. "మీారెవరు? సినిమాలు తీయటంలో ఏమి అనుభవం వుంది?" అని అతను అడిగిన పాపాన పోలేదు

"ఏమండీ, మూర్తిగారూ? మనం ఏసబ్జెక్టు తీసుకుంటే బాగుంటుందంటారు?" అన్నాడు సీనాయి డైరెక్టరు మాటలను నిర్దాక్షిణ్యంగా తోసేస్తూ. ఎవరన్నా తనతో మాట్లాడుతున్నప్పుడు సీనాయి వింటున్నాడనుకోవటానికి లేదు.

ఇప్పుడు సీనాయికి చాలాసంతోషంగా వుంది. ఇంత కాలానికి తనకు సినిమా చిత్ర నిర్మాణం గురించి తనతో మాట్లాడే అర్హతగలవాడు దొరికాడన్న సంతోషం వాడి మొహాన కనిపించింది. ఇక నాతో ఏదన్నా చెప్పుకోవటానికి గాని, నన్ను అడగటానికిగాని సీనాయికి అవసరంలేదు.

అంతా ఒకగంటలోపుగా సీనాయి మూర్తిని "ఏమండీ" అనటంమానేసి "ఏమిటయ్యా" అనీ, అదికూడా మానేసి "ఏమిటోయ్" అనీ అన్నాడు. పొద్దూకేలోపల ఏమిరా అంటే ఏమిరా అనుకునే స్నేహం మూర్తికీ సీనాయికీ ఏర్పడి తీరుతుందని నాలో నేను దృఢం చేసుకున్నాను. మూర్తితో తను స్నేహం చెయ్యటంవల్ల నేను అసూయపడి చచ్చిపోతానని సీనాయి అనుకుని ఉన్నా, నాకాశ్చర్యం లేదు.

మూర్తికి రెండువందలూ అడ్వాన్సిచ్చారు. రెండు పచ్చనోట్లు భక్తితో మడిచి జేబులో పెట్టుకోగానే మూర్తి పక్కా వ్యాపారస్తుడయిపోయి, "మనం సోషల్ పిక్చరే తీయటం మంచిది. నాదగ్గిర ఒకటి రెండు కథలున్నాయి. నచ్చితే వాటిని తీసుకోవచ్చు. లేకపోతే కొత్తది రాసుకోవచ్చు. కథ అనుకోగానే మనం నటులను బుక్కు చేసుకోవచ్చు. సినేరియో నేనేరాస్తాను. సంభాషణలూ అవీ రాయించుకుని రిహార్సల్సు ప్రారంభించవచ్చు," అని ప్రణాళిక ఏర్పాటుచేశాడు.

ఆరోజు లగాయతు రోజూ మూర్తి రాసాగాడు. అతనూ సీనాయీ కలిసి ఎక్కడెక్కడో తిరిగేవారు. ఏమీ మాటో చేసేవాడు అప్పుడప్పుడూ రంగడుకూడా వాళ్ళ వెంట వెళ్లేవాడు. పుచ్చుకున్న రెండువందలూగాక మూర్తి సీనాయినో, "అ సే బ్రదర్, ఒక ఫైవర్ ఇట్లా పారెయ్యి?" అని అయిదూ పదీ రూపాయలనోట్లు పుచ్చుకుంటూ ఉండేవాడు.

"అబ్బే నాతో మీ కేమీ పనిలేదు. నేను తిరిగి వెళ్ళి పోతాను," అని చెప్పాను మా రంగడితో.

"ఛీ ఛీ అదేమిట్రా? ఉన్న పనంతా నీతోనే ఉంటేనూ?" అన్నాడు రంగడు.

"నాపనేమిటో, ఎంతఇస్తారో తేల్చి ఏదో కంట్రాక్టు తగలేయించు. మూర్తి నాతరవాత వచ్చాడు. ఏదో లెక్కన అతనికి ముట్టుతున్నది. నేనిక్కడ కూర్చుని హోటల్లో తింటుంటే ఇంటికగ్గిర వాళ్లెంకావాలీ?" అన్నాను.

"ఆమాట చెప్పరాదూ? ఇవాళే మనియార్డరు చేయిస్తాను. ఎంత? ఓ పాతిక పంపనా?" అన్నాడు రంగడు.

"ప్రస్తుతం పాతికపంపు తరవాత చూద్దాం," అన్నాను.

పది, పదిహేనురోజులు గడిచినై. ఇన్నాళ్ళూ అతుక్కుపోయిన సీనూ మూర్తి ఊడవచ్చినట్టు నాకేదో సందేహం కలిగింది. సీను మళ్ళీ అకస్మాత్తుగా నా ప్రాణ మిత్రుడు కావటానికి ప్రయత్నించాడు. స్టూడియో బుక్ చేశామనీ, రెండుమూడు కథలు ఆలోచించామనీ చెప్పి అందులో ఏదిబాగుందో చూసి, ఏదీ బాగాలేకపోతే నన్ను సొంతాన రాయమని అడిగాడు సీనాయి.

వాడు చెప్పిన కథలన్నీ వింటే నాకేదీ బాగాలేదు. అన్నిటిలోనూ రాజులూ రాణులూ వున్నారు ఒకదానిలో పిస్తోళ్ళున్నాయి, మరొకదాన్లో స్త్రీయుద్ధం ఉంది.

"ఇవన్నీ పదేళ్ళక్రితం తీసిన సైలెంటు చిత్రాల కథలే," అన్నాను

"అయితే నువ్వొక నూంచి కథరాయి," అన్నాడు సీనాయి.

"కథ ఏదో ఒకటి చూడవచ్చు. కాని నాకా సినేరియో ఏమిటో తెలిదే?" అన్నాను.

"అది మూర్తిగాడు చూసుకుంటాడులే." అన్నాడు సీనాయి

నిజానికి నేను కథగురించి ఆలోచిస్తూనే ఉన్నాను. సినిమాకథకు కేంద్రంలో ఒక సార్వజనీనమైన అంశం వుండాలని ఎక్కడో చదివాను. ఆడదాని మానసంరక్షణమో, మాతృత్వమో ఏదో ఒకటి ఏడవాలి. అందుకని ఆ రెండు అంశాలూ కలిసివచ్చేటట్టు ఒకకథ ఆలోచించి పెట్టాను.

నేను చెప్పేకథవిని సీనాయి సంతోషంతో గంతులేసి, "ఇది చాలా ఫస్టుగా ఉంటుందబ్బాయ్!" అని మళ్ళీ వచ్చి కూచుని రంగడితో, "ఏమిటో అనుకున్నాను. ఆ మూర్తిగాడు కథవిషయంలో వొట్టి బోకురా!" అన్నాడు.

"అతను డైరెక్టుచేస్తానని వచ్చాడు కథరాస్తానని రా లేదు," అన్నాను.

మళ్ళీ మొదలుపెట్టావా నీ వెధవధోరణి, అన్నట్టు సీనాయి నావంక ఒకచూపుచూసి ఆ పరిస్థితుల్లో నన్ను క్షమించటానికే నిశ్చయించుకున్నట్టుకనపడ్డాడు. ఇన్నాళ్ళూ

నన్ను తాను శిక్షించినట్టూ నాలో కొంత పరివర్తన కలిగి నట్టూ వాడూహించి ఉండాలి పాపం.

"అయితే ఈ కథలో కొన్ని మార్పులు చేస్తే బాగుంటుంది," అన్నాడు సీనాయి.

"ఏమిటవి?" అన్నాను.

"కథానాయికను తండ్రి అప్పుల బాధవల్ల ఆ ధనవంతుడికిచ్చి చేసేబదులు, ఆ అమ్మాయికి సవతితల్లిని పెట్టి బాధలు పెడితే ఇంకా బాగుండదూ? ఇంకా అంతకన్న మంచి ఆలోచన చెప్పనా? ఆ అమ్మాయిని అడవి టార్జాను లాగా చూపిద్దాం. అడవిలో ఆమె ధనికుడికి దొరుకుతుంది. తెచ్చి పెళ్ళిచేసుకుంటాడు. వాడు తనకు వద్దని చెప్పటానికి మాటలు రావుగా? గర్భాదానంనాడు రాత్రి కొందరు అడివి మనుష్యులు వచ్చి ఆ పిల్లను ఎత్తుకుపోతారు..."

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? అడవిమనిషి ఒకడు ఆపిల్లను మోహించినట్టు పెట్టవచ్చు"

ఈధోరణిలో సీనాయి నాకథను తిరగరాస్తూ వెళ్ళాడు ఆఖరుకు వాడు తేల్చిన కథకూ నేననుకున్న దానికీ సంబంధం లేకుండా పోయింది.

"ఈవిధంగా రాయమన్నావా? అన్నాను.

"ఏమో, నాకొంద నాకేం తెలుస్తుందీ? నేనేదో వాగాను. బాగుంటేరాయి" అన్నాడు. కూచుని రాశాను.

—

ఒకరాత్రి సీనాయి నాకథచదివి దమ్మిడీ అంత మొహంచేసుకుని "చూశావా? నేచెప్పింది ఒక్కటైనా పెట్టలేదు," అన్నాడు.

"అదికాదు, నువ్వు ఏ అధికారంతో చెబుతున్నదీ నాకర్థం కావటంలేదు. ప్రొఫెస్సరు హోదాలో ఏమార్పు చెయ్యమన్నా చేస్తాను. అంతా నువ్వేచెప్పి, ఆఖరుకు నిర్ణయం నన్నే చెయ్యమంటే, నా నిర్ణయం చేశాను!" అన్నాను.

"ఆకాడికి నేను నోరునొప్పెత్తేట్టు చెప్పింది దేనికి?"

"ఏమో! నీకు కథరాయటం గురించి ఏగుడ్డూ తెలీదు. కథచెప్పటం నీకు సరదా. నీ బుద్ధికి తోచిందల్లా సరదాగా చెబుతావు. నాకు కథరాయటంపని. కథరాసేటప్పుడు నాకు కొన్ని బాధ్యతలు ఏడిచినయి. వాటిని సరిగా నిర్వర్తించడం పెద్దపని. అట్లాకాక నీ పూచీమీద నన్ను ఏమి రాయమన్నా రాస్తాను" అన్నాను.

"ఎక్కడ తద్దినం వచ్చిందిరా, బాబూ!" అని వాపోయినాడు సీనాయి.

"ఆమాట వెంటనే ఉపసంహరించుకోకపోతే నేనీ క్షణం మావూరు వెళ్ళిపోతున్నాను." అన్నాను.

సీనాయి తక్షణం క్షమాపణ ఇచ్చి, క్షమాపణ ఇచ్చిన

బింకంకూడా లేకుండా నవ్వుతూ, «నువు తప్ప ఇంకెవడూ తెలిసినవాడు లేడని నీ నమ్మకంగాదూ ?" అన్నాడు.

«కనీసం నాకన్న తెలివిగలవాణ్ని నేను వెంటనే గుర్తించగలను. కొందరికది కూడా చాతకాదు." అన్నాను.

అప్పటికావిషయం అంతటితో సరిపోయింది.

మర్నాడు నేనూ, రంగనాథమూ, సీనాయీ కలిసి ఏదో సినిమాకు వెళ్లాం. సినిమా ప్రారంభం అయి ఒక అయిదునిముషాలన్నా కాకమునుపే సీనాయి, "మనం ఈ కథ తీస్తే ?" అన్నాడు. చూద్దామన్నాను.

ఇంటికి వచ్చినాక, «ఇదిఖరారు. మనం ఇవాళ చూసిన పిక్చరు తీసేద్దాం." అన్నాడు సీనాయి. ముందు వెనకా చూడకుండా నన్ను రాసుకుపొమ్మన్నాడు. రాశాను.

మర్నాడు సీనాయి మరో సినిమా చూసివచ్చాడు. అది రాయమన్నాడు. ఇన్నికథలు రాయటానికి నాకు ఓపిక లేదన్నాను. సీనాయి మొహం చిట్లించి, «మన మొదటి కథ బాగా లేదు. ఇంకొకటి ఏదైనా రాయి" అన్నాడు.

«రేపు మనమందరమూ కూర్చుని చర్చించుకుందాం. ఇటువంటి కథ అనుకుందాం. ఆ తరువాత నేను రాస్తాను. సినిమా చూసి చూసి ఇంత తొందరలో నువ్వెన్నటికీ ఒక నిర్ధారణకు రాలేవు." అన్నాను.

* * *

సినిమా తీయటానికి - సన్నాహాలు అతి చురుకుగా సాగిన్నై, సీనాయీ డైరెక్టరూ కలిసి కథ నిర్ణయించుకున్నారు. దానికి ముక్కూ-మొహమూ ఉన్నట్టు నాకు కనిపించలేదు అదివరకు వచ్చిన ఫిలుములలో ఉన్న సన్నివేశాలు కానివి ఒక్కటీ ఇందులో లేదు.

ఆ తరువాత ఆడవాళ్ళ బుకింగు ప్రారంభమయింది. సీనాయి తనకు సంబంధంఉన్న ఒక ఆడదాన్ని తెచ్చాడు. డైరెక్టరు మూర్తి తనకు సంబంధంఉన్న మరొకతెను, దానితో సంబధముున్న మరొకతెను తెచ్చాడు ఈవచ్చినవాళ్ళెవరికీ డొక్క-శుద్ధి లేదు. క్రమంగా సీనాయి చుట్టూ ఒకరకం మనుష్యులు చేరసాగారు. వీళ్ళంతా చేరి తీయబోయే పిక్చరుగురించి మాట్లాడుతుంటే నాకు భయంవేసేది. ఇంత ఆత్మజ్ఞాన విమూఢులుకూడా ఉంటారా? వీళ్ళు సినిమా తీస్తామని రావటమూ, వాళ్ళు రావటానికి ఏ అంతరాయాలూ లేకపోటమూ చూస్తే నా కాశ్చర్యంగా ఉండేది.

అదివరకల్లా నాకు సినిమావ్యామోహం లేదనుకునేవాణ్ణి. కాని నాకు తెలీకుండా ఉండి ఉండాలి. ఇప్పుడు సినిమాగురించి నాకున్న అసహ్యంచూస్తే వెనక నాకున్న భావం వ్యామోహమే అయిఉండాలి. ఇంకేమై ఉంటుందని పించింది. ఈ మూకలో నేనుకూడా ఒకణ్ణనుకున్నప్పుడల్లా ఏదో వింత వికారం నాలో కలుగుతూ వచ్చేది. ఒకవేళ నేను మడిగట్టుకున్న మనిషినేమో? ఎవరితోటీ కలవటం నాకిష్టంలేదేమో? అదివరకల్లా ఈ రహ

స్యం నేను తెలుసుకోలేకపోయినానేమో? లేకపోతే జాతినీ కులాన్నీ పాటించనినేను ఈ మనుషులను ఇంత నీచంగా ఎందుకు చూస్తున్నాను? ఈ ఆలోచనలు నన్ను బాధించ సాగాయి.

అన్నిటికన్నా నన్ను మరీ బాధిస్తూవచ్చినది డబ్బు. డబ్బేమో సినిమాపేర నీటిపతుగా ఖర్చయిపోతున్నది. నా చేతికి ఒక దమ్మిడీ వచ్చిందిలేదు. వచ్చి రెండు నెల్లయింది. ఇంటికొక నలభైరూపాయలు వెళ్లినై. నాకింద ఏరెండువం దలో ఖర్చయినై. కాని దానివల్ల నాకేమీ ఫలితం కలగ లేదు హోటళ్లవాళ్లూ వాళ్లూ బాగుపడ్డారు. నేను చేసినపనిఅసలే లేదు నన్నింటిదగ్గిర కూర్చోబెట్టి ఈరెండువందల్లో సహం ఇచ్చినా నాకో అయిదారునెల్ల గ్రాసం ఏర్పడి ఉండును. ఎన్నో కంట్రాక్టులు రాశాను. ఎన్నోవందలు అడ్వాన్సి చ్చారు. వేషం వెయ్యటానికి తెచ్చిన వాళ్ళలో నాకున్న పాటి మొహంకూడా లేనివాళ్ళున్నారు. పాడటానికి వచ్చిన వాళ్ళలో నాపాటవిని ఆనందించే నిర్భాగ్యులున్నారు. వాళ్ళందరిపేరా కంట్రాక్టులున్నై. నాపేర ఎందుకు లేవంటే నేను పెళ్లివారి తరపు మనిషిని!

పోనీ రెండునెల్లు విశ్రాంతిగా కూర్చున్న తృప్తి అయినా నాకు దక్కిందా అంటే అదీలేదు. నేను కథరాయ టమే కాక, అది ఆమోదించ బడుతుందనే నమ్మకంతో దానికి సంభాషణలుకూడా రాశాను. పాటలుకూడా రాసే వాణ్నేమోకాని, ముందుగా మ్యూజిక్ డైరెక్టరు ఏసేమ మట్లు తస్కరిస్తాడో తెలియకుండా పాటలు రాయటం

క్షేమం కాదన్నారు. ఈపనికూడా అయినాక నాకేమీ తోచక సినిమా టెక్నిక్ మీదా, స్క్రిప్టురైటింగు మీదా పుస్తకాలు కొని చదవ సాగాను. ఆ పుస్తకాలు చదివినాక నాకొకటి స్పష్టంగా తెలిసింది. ఈఫిలిం నిర్మాణంలోకి అనుభవం లేనివాళ్లు వచ్చినా దిగరాదు. ఈ పుస్తకాలు కొంచెం ముందర్రిగా చదివి ఉంటే నేను తగుదునమ్మా అని వచ్చినా ఆకథగాని ఆసంభాషణలుగాని రాసి ఉండను. నేనే అనుకుంటే నాకన్న అసమర్థులు నా చుట్టూ ఉన్నవారు.

ఈ వాతావరణంలో నాలో ఒకవిధమైన జడత్వం ప్రవేశించింది. "ఎవరెట్లా చస్తే నాకేం?" అనే విరక్తి ఒకటి నన్నావేశించింది. భరించలేని బాధ కలిగినప్పుడు మనిషికి స్పృహతప్పినట్టుగా, భరించలేని ఆలోచనలు కలిగినప్పుడు బుద్ధికూడా స్పృహతప్పుతుంది. ఇది నా మనస్థితికి ద్వితీయావస్థ. ఈ అవస్థలో నేను ఇతరులు చేసేదాని గురించి విమర్శించటం మానేశాను. వెలుగులోనుంచి చీకటిగదిలోకి వచ్చినవాడి కళ్ళకు మొదట అంతా గాఢాంధకారంగా ఉండి క్రమంగా వెలుగునీడలు అవుపించినట్టుగా నాబుద్ధికి సినాయిచేసే ప్రయత్నాలలో ఇప్పుడు కొంత మంచీ, కొంత చెడూ కనిపించసాగింది. వాడి అవివేకం కొంత వహించటం నేర్చుకోసాగాను.

ఈవిధంగా నాబుద్ధి పరిస్థితులకు అలవాటుపడుతూ రావటంవల్ల నాకేమీ లాభంకలగలేదు. ఎందుచేతనంటే

క్రమంగా పరిస్థితులు క్షీణించసాగాయి. డబ్బు చాలాభాగం అయిపోయింది కథకింకా సంభాషణలు రాస్తున్న సమయంలోనే డబ్బు లెక్కలు చూసుకోవటం జరిగి అప్పటికే ముప్పైవేలు అయిపోయినట్టు బసవయ్యగారు అంచనా కట్టాడు అంతా చేరి డబ్బు తగలేశారనే మాటవచ్చింది. సీనాయికిగాని మూర్తికిగాని ఈమాట ఏమీ బాధకలిగించ లేదు. కాని నేనూ, రంగడూ గిలగిలలాడిపోయినాం.రంగడు సీనాయిని దబాయించాడు కూడానూ, కాని సీనాయి నిర్లక్ష్యంగా "అందరమూ డబ్బు తగలేసినవాళ్ళమే ఇందులో తక్కువ తిన్నవాడెవడూ లేడు" అనేశాడు.

డబ్బునుగురించి ఎప్పుడయితే పంచాయతీ జరిగిందో ఆ పంచాయతీలో మిగిలిన విషయాలు కూడా వచ్చాయి. ఇంతవరకూ పిక్చరు షూటింగు ఎందుకు ప్రారంభం కాలేదు? బుక్కుచేసిన వాళ్ళకి జీతాలు ముట్టుతున్నాయి. స్టూడియోకు ఏనాడో ఎడ్వాన్సివ్వటం జరిగింది. ఎంతా తరవాత వచ్చిన వాళ్ళు సహం పిక్చరు పూర్తి చేసుకున్నారు అదే స్టూడియోలో.

"మనంకూడా షూటింగుకు రడీగానే ఉన్నాం. సంభాషణలేవి? పాటలేవి?" అన్నాడు మూర్తి.

"ట్రీట్మెంటులేకుండా సంభాషణలు గాలిలో రాస్తామా?" అన్నాను.

"అయ్యో, ఇది హాలీవుడ్డుకాదు. కథవుంది. ఒకటీ రెండూ, మూడూ అని మీకు సీక్వెన్సులిస్తాను. వాటికి

సంభాషలు రాసెయ్యండి ముందు. ఫలాని సెట్టనుకుంటే ఆసెట్టు మీాద వచ్చే సీక్వెన్సులన్నీ రాసేద్దురుగాని," అన్నాడు మూర్తి.

ఆ క్షణానికి మూర్తి చాలా దక్షతగలవాడుగా బయటపడ్డాడు. మర్నాడుదయం అతను ఒక చిన్నసైజు కాగితంమీాద అటూ ఇటూ పొడిమాటలు రాసుకొచ్చాడు. ఆ మాటలముందు అంకెలు వేశాడు. మొత్తం 19 అంకెలున్నాయి. కాగితం పొడుగు ఆరంగుళాలూ, వెడల్పు రెండంగుళాలూ ఉన్నది. అదే మా సినేరియో అని నే నర్థంచేసుకున్నాను. వాటిల్లో ఒక్క సెట్టుమీాద వచ్చే నాలుగైదు సీక్వెన్సులుచూసి వాటికి నన్ను సంభాషణలు రాయమన్నాడు డైరెక్టరు. ఏ రంగంలో ఏయే పాత్రలుంటాయో ముందురాసుకున్న కథనుబట్టి స్పష్టంగా తెలీదు. పోనీ 20 సీక్వెన్సులూ రాసుకున్నాకనే షూటింగు ప్రారంభించకూడదా, అన్నాను."

"ఒక్కక్షణం వృథా చెయ్యటం నా కిష్టంలేదు. మీాకేం మహారాజులు. ఇంకో పదివేలు ఖర్చయితే మీాకు లెఖ్ఖలేదు. నేను పైకి రావలసినవాణ్ని. మీా వీలుకోసం నేను కీర్తి పాడుచేసుకుంటే రేపు నాకు మంచినీళ్ళు పుట్టవు." అన్నాడు మూర్తి.

అతను కోరినట్టే రాశాను. ముఖ్యపాత్రలుమాత్రం నే నెరుగుదురును. కాని తాత్కాలికంగా వచ్చే పాత్రలను ముందు రంగాల్లో ఏవిధంగా ఉపయోగించుకోవచ్చు. తర

వాత వాళ్ళతో పని ఏమైనా వస్తుందో రాదో కూడా నాకు తెలియదు.

సంభాషణలు చాలా బాగున్నాయన్నారందరూనూ నాకే తెలియని విషయం వాళ్ళకు తెలియటం చూస్తే ఆశ్చర్యం వేసింది. అయితే నాచుట్టూ ఉన్న వాళ్ళెటువంటి వాళ్ళంటే ఏదో, కథలో ఏదో పాత్ర నోటినుంచి ఒక సంభాషణ ఎత్తి పరీక్షించి, కథగాని పాత్రగాని తెలియకుండా ఆసంభాషణ బాగున్నదీ లేనిదీ చెప్పేరకం.

♦ ♦ ♦

ఎంతో కాలంగా ఎదురుచూసిన దివ్యఘడియ వచ్చింది. మా చిత్రం షూటింగు ప్రారంభించే రోజు వచ్చింది. సెట్టింగు సిద్ధంగా ఉంది. వచ్చి పని ప్రారంభించుకోమన్నారు స్టూడియోదార్లు. ఇప్పటికి లాడ్జిలో 20మంది దాకా పాత్రధారులున్నారు. అందులో ఒకరిద్దరు వెనక సినిమాల్లో వేసిన వాళ్ళేగాని ఖ్యాతిగడించిన వాళ్ళుకారు. మిగిలినవాళ్ళంతా అదోరకం సజ్జు.

షూటింగునాడు మూర్తి తప్పతాగి సెట్టుమీదికి వచ్చాడు. వాడితో సమంగా తాగిఉన్నాడు సీనాయి. అయితే సీనాయి నలుగురి ఎదటా పడలేదు. లైట్లులేని మూలగా చూసుకుని నిద్రపోయినాడు. మూర్తి మాత్రం ఒకచెంప తూలిపడిపోతున్నా, సెట్టంతా పర్యటనం చేస్తూ, కనపడ్డ వాడికల్లా, "నమస్కారమండి, ఇప్పుడు చూపిస్తా,

నాతడాఖా!" అంటూ నానా అల్లరి చేస్తున్నాడు. స్టూడియో తాలూకు మనుషులు కొందరు వాణ్ణి బయటికి నెట్టారుగాని, వాడే డైరెక్టరని తెలిసినాక ఏం చెయ్యాలో వాళ్ళకీ తెలీలేదు.

డైరెక్టరు పదవి ఇచ్చేదాతలున్నారు కనుక మూర్తి డైరెక్షనను అంగీకరించాడేగాని, ఆపని చెయ్యగల ననే ధైర్యం అతనికీలేదు. తీరా శాధ్యతను ఎదుర్కొ-వలసి వచ్చే సమయానికి బెదిరిపోయి సీనాయితోపాటు చిత్తుగా తాగివచ్చాడు. వాడినిషా దిగటానికి కాఫీ యిచ్చారు. కాఫీ తాగేసి భళ్ళున వాంతి చేసుకున్నాడు. ఆ తరవాత పెద్ద పెట్టున ఏడుపు సాగించాడు.

ఆనాటికి ఎట్లాగో ఒకపాటు తీసేశారు. నేను "కవి" గనక కొంచెం సహాయంచేస్తే మరి కొన్నిపాట్లు తీస్తా నన్నాడు కామెరామాన్. అతనికి కావలిసిన సహాయం ఏదో ఆ రోజుకు చేసేశాను.

మర్నాడు మా రంగడు, "నువే డైరెక్టు చెయ్యరా! వాణ్ణి వెళ్ళగొట్టేద్దాం! వాడేమీ పనికివస్తాడని నాకు తోచటంలేదు" అన్నాడు నాతో. డైరెక్టు చెయ్యటం నా పని కాదని చెప్పాను. మూర్తితో బసవయ్యగారు చాలా ఘర్షణ పడటంకూడా జరిగింది. కాని సీనాయి మూర్తికి క్షమాపణచెప్పి మళ్ళీ వాణ్ణే పెట్టించాడు. నేను డైరెక్టు చేస్తానని ముందుకు రాకపోవటం చాలా మంచిదయింది.

మూర్తి ఆధ్వర్యంతోనే షూటింగు సాగింది. ఫొటో గ్రాఫరుచేతా, రికార్డిస్టుచేతా రోజూ మూర్తి చివాట్లు తినేవాడు. వాడిమాట లైట్లవాళ్ళు కూడా వినేవాళ్ళుకారు. «లైట్స్, రెడీ. షూట్» అని అరవటం వాడికి తెలుసు. కామెరా సిద్ధంగా వుందా, ట్రాన్స్‌ఫార్మరు స్టార్టు అయిందా అనే ఆలోచన లేదు. రికార్డిస్టు చేసేసంజ్ఞలు విని పించుకునేవాడు కాడు. ఈ గొడవంతా చూసి వాడిమాట ఎవరూ వినిపించుకోవటం మానేశారు. తాను తీస్తున్నపాటే వాడికి తెలిసేదికాదు. మూర్తివల్ల పనికాదు మరొకర్ని పెట్టుకోమని మంచిగా బసవయ్యగారికీ. సీనాయికీ కూడా చెప్పాను. సీనాయి నా మీద ఎగిరిపడ్డాడు. నీకు డైరెక్ష నేం తెలుసునన్నాడు. నేను గొప్పవాణ్ణనుకుంటున్నాననే బాధ ఎంతకాలంనుంచీ వాడి హృదయంలో పేరుకుని ఉందోగాని ఆ క్షణాన చాలా వెళ్ళగక్కాడు.

మూర్తిగాడితో పనికాదనేమాట బసవయ్యగారితో స్టూడియోవాళ్ళే అనటం జరిగింది. అప్పుడు సీనాయి వాళ్ళతో, «మీ కేం తెలుసు ?» అనే అవకాశం లేక పోయింది. ముందరే ఆ మాట చెప్పినందుకు నన్ను సీనాయి అభినందించనూలేదు. కాని ఒక కొత్త ఉపాయం ఆలో చించాడు.

«మూర్తిగాడిమీద మనం బాధ్యత వెయ్యకుండా వాడేంచెయ్యవలిసిందీ నిర్ణయించటానికి ఒక సంఘం తయారుచేసుకుందాం» అన్నాడు సీనాయి.

మూర్తికి సలహాయిచ్చే తాహతున్న మనుషులు, వాళ్ళే డైరెక్షన్ చెయ్యవచ్చుగా ?” అన్నాను.

సీనాయి ఏదైనా సహించగలడుగాని నా నోట యథార్థంవస్తే సహించలేడు.

“నువ్వేదీ చెప్పవు. మమ్మల్ని ఏ ఆలోచనా చెయ్య నియ్యవు. నువు మాలోవాడివా ? మాకు విరోధివా ?” అని అడిగాడు సీనాయి నన్ను.

“మీలోవాణ్ణీకాను, మీ విరోధినీకాను. దగ్గిర ఉన్నాను గనక నీ మంచికోసం చెబుతున్నాను. డైరెక్టు చెయ్యటం చాతగానివాళ్ళు నలుగురుచేరి డైరెక్టరని వచ్చిన వాడికి ఏం చెయ్యాలో చెబుతారా ? దానివల్ల లాభం ఏమిటి ? పైగా ఎంత నష్టంఉంది ! రేపు వాడు పిక్చరు తగలేస్తే వాణ్ణి మనం ఏమీ అనటానికైనా ఉండదే ? ‘మీరే నన్ను చెయ్యమన్నారు. మీ ఒప్పుదలతోటే అంతా చేశాను.’ అని వాడనడూ ?” అన్నాను.

సీనాయి మొహం మాడ్చుకుని, “ఏమో. ఇప్పటికి డైరెక్టరును కుదర్చటం అసంభవం. మూర్తి అడ్వాన్సుగా చాలాడబ్బు తినివున్నాడు. మనం పట్టుకోగల తప్పులైనా లేకుండా చూసుకోవచ్చుగద. నేను చెప్పినట్టు చెయ్యాలిసిందే !” అన్నాడు. వాడి వాదం తండ్రికి నచ్చినట్టు కనపడింది.

సీనాయి చెప్పినట్టు చెయ్యటంవల్ల కలిగినప్రయోజ

నం ఏమీ లేకపోయింది. మూర్తికి ఏం చెయ్యాలో చెప్పే పని సీనాయి తనమీదే వేసుకున్నాడు.

ఇక ఈ సినిమాతో నా కేమీ సంబంధం అవసరం లేదనిపించింది. రెండురోజులపాటు కూచుని మిగిలిన సీక్వెన్సులకు సంభాషణలన్నీ రాసేసి, నాకు తోచిన పాటలుకూడా రాసి రంగనాథంతో, "అబ్బాయీ, నాకు చెక్కవంగింది. ఏమైనా వచ్చేదివుంటే యిప్పించు. నేను వెళతాను" అన్నాను.

"చివరదాకా ఉండరా ! నీకు జీతం ఏమిటి ఖర్మం ? పిక్చరుమీద లాభంలో నీకు మూడోవంతు వస్తుంది. అందులో సహం నీ కిస్తాను" అన్నాడు రంగడు.

"అంతా ఇవ్వమన్నా నాకే యిస్తావు ! కాని ఇంకో లక్షలేందే ఈ పిక్చరు పూర్తికాదు. పూర్తి అయినాక ఇది ఒక వారమన్నా నడుస్తుందో నడవదో. ఇందులో లాభం వచ్చేదేమిటి ? నువు నా కిచ్చేదేమిటి ?" అన్నాను.

నా మాటలన్నీ తూచా తప్పకుండా రంగడు సీనాయితో చెప్పాడని నే నూహించాను. సీనాయి నా దగ్గిరకి వచ్చి, "వెళ్ళిపోతామన్నారుటగా ?" అన్నాడు. ఎన్నడూ లేని బహువచనం ప్రయోగిస్తూ.

"అవును. నే నిప్పటికివచ్చి నాలుగు నెలలు కావస్తున్నది. నా పనేమో ఎంతకీ అయిపోదు. సంభాషణలూ, పాటలూ రాసేశాను. ఇంటిదగ్గిర పెళ్ళాం పిల్లలు లేమవు

తున్నారో తెలీదు. నా కేదన్నా వచ్చేదుంటే ఇప్పిస్తే నేను పోతాను” అన్నాను.

“దానికేంగాని, మీరు ఏం చేసినా, చెయ్యకపోయినా చివరదాకావుండి సహాయం చేస్తారేమో అనుకున్నాం. అసలు మీకు మా పిక్చరులోనే ఇంటరస్టు లేదని తేలిపోయింది. ఆ భాగ్యానికి యిన్నాళ్ళుండటంకూడా అనవసరమే. ఎప్పుడు వెళతానన్నా మా అభ్యంతరం ఉండేది కాదు...అయితే ఇప్పుడు మీ కేం రావాలంటారు ?” అన్నాడు.

సీనాయి వాగ్ధోరణి నాకు నచ్చటంలేదు. కాని వాడితో పోట్లాడటానికి నా కేమీ ఓపిక లేదు.

“ఇంత రావాలని నే ననటంలేదు. ఇంటికి పోతున్నాను కనక నా ఎకౌంటు సెటిల్ చెయ్యమంటున్నాను” అన్నాను.

“ఇంటికి వెళ్ళటానికి పదిరూపాయలు చాలవూ ?” అన్నాడు సీనాయి.

ఈ మాటకి నేను దిమ్మరపోయినాను. కాని నానోట ఏమాటా వచ్చేలోపలే నా పక్కనున్న రంగడు కాలిచెడావు విప్పి సీనాయి నెత్తిన ఫెడీమని కొట్టాడు. సీనాయి మొహాన చావుభయం కనిపించింది.

“బుద్ధితక్కువగా మాట్లాడితే చంపేస్తానురోయ్, సీనాయ్ ! నీ పిక్చర్లో వాడు ఇంటరెస్టు తీసుకోలేదంటావు. నువు వాణ్నెన్నడైనా ఇంటరెస్టు తీసుకోనిచ్చావా ? తనకు

చాతకాని పన్లకు రాకపోవటమేనా వాడు చేసిన ద్రోహం ? ఎన్నివిషయాలలో వాడు ముందుగా జరగబొయ్యే నష్టాలు చెప్పాడు ? ఒకటైనా పొల్లుపోయిందా ? ఒక్కసారయినా విన్నావా?" అన్నాడు.

రంగడు నన్ని పిక్చరు గొడవలోకి దించి ఏమైనా తప్పుచేసి వుంటే దానికంతకూ ఈ మాటలతో పరిహారం చేశాడు.

అంతేకాక రంగడు నా వెంట తనూ బయల్దేరాడు. రంగడు నాకు కనీసం రెండువందలన్నా యిప్పించాలని చూశాడు. కాని బసవయ్యగారు పాతికరూపాయలు నా చేతిలో పెట్టి, ప్రస్తుతం ఖర్చుకు వుంచుకోండి. తరవాత చేతిలో డబ్బుచూసుకుని మనియార్డరు చేస్తాను" అన్నాడు.

డబ్బు లేకపోతే పీడాపాయిరి. నేనా బెడద వది లించుకుని బయటపడ్డాను. అదే నాకు పదివేలు. ఆ పిక్చరు పూర్తికాలేదు. బసవయ్యకు పిచ్చి ఎత్తిందనికూడా విన్నాను. ఈ దిక్కుమాలిన పిక్చరుకోసం ఆయన ఉన్న దంతా పోగొట్టుకుని అప్పులపాలుకూడా అయినాడుట. ఒక స్థితిలో కొంత తయారైన పిక్చరును అమ్మజూపితే పదివేలూ, పదిహేనువేలూ యిస్తామన్నారుట. ఆ పిక్చరు పూర్తికాలే దన్నా, బసవయ్యకు పిచ్చిఎత్తిందన్నా నాకేమీ ఆశ్చర్యం లేదు. కాని, కాలినవాడికి నిప్పంటే భయమైనట్టు ఈనాటికీ నాకు సినిమా అంటేమటుకు చచ్చేభయం మిగిలిఉంది.

# ఔట్

పిల్లలు ఇంటిముందు అల్లరిగా ఆటాడుతున్నారు. నలుగు రమ్మాయిలూ, ఇద్దరబ్బాయిలూనూ. అబ్బాయి లిద్దరూ ఒకరి నొకరు "ఔట్" చేసుకోవలిసిందేకాని, ఆడ పిల్లలు వాళ్ళని "ఔట్" చెయ్యలేరు.

శేషు వరండాలో స్తంభాని కానుకుని నిలబడి వాళ్ళ ఆటను గమనిస్తున్నది. ఆమె మొహం చూస్తే ఏదో పర ధ్యానంలో వున్నట్టు కనిపించినా ఆమె ఆలోచనలు పిల్లల ఆటకు ఆట్టే దూరం పోలేదు:

ఆడే పిల్లల్లో కల్లా సీను పెద్దవాడు. పన్నెండేళ్ళుంటై. చక్కని మొహం, పెద్ద కళ్ళు, పట్టుకుచ్చులాంటి జుట్టు. ఏ మాత్రమూ అలవకుండా అందర్నీ పరుగెత్తిస్తున్నాడు. ఆటకు నాయకుడు. ఆడపిల్లల్లోకల్లా రవణి పెద్దది పదేళ్ళు. మిగిలినవాళ్ళకన్న చాలా అందగత్తె. రవణి అంటే సీను కిష్టమేమో. లేకపోతే దాన్ని ఒక్కసారైనా ఔటు చెయ్యడా ?...అవును, అందుకే స్సీను సుబ్బుల్నికూడా ఔటు చేశాడు. ఎందుకంటే సుబ్బులు రవణిని ఔట్

చేశాడు. సుబ్బులు రవణిని ఔటు చేశాడనే పంతంకొద్దీ సీను సుబ్బుల్ని రెండుసార్లు వరసగా ఔటు చేశాడు.... మగపిల్లలు దొంగలయి వెంటపడ్డప్పుడల్లా ఆడపిల్లలు కయ్యోమని అరుస్తారు. చెవులు చిల్లులుపడేట్టు. పాడుముండ రవణి అందరికన్నా చెవులు గింగుర్లెత్తిస్తుంది...

ఆటలో ఔటయితేనేం ? ఆటలో షరతులన్నీ మనం పెట్టుకునేవేగా ? ముట్టుకుంటే దొంగ కావటమూ, ముట్టుకునే లోపుగా కూర్చుంటే దొంగ కాకపోవటమూ, అందరికన్నా ఆఖరుకు కూర్చున్నవాళ్ళు దొంగ కావటమూ, కూర్చున్నవాళ్లు, పరిగెత్తేవాళ్లు ముట్టుకుంటే గాని లేవలేకపోవటమూ—ఇవన్నీ నిజమా ? వొట్టి ఆట. అంతా అనుకోవటాలే.

మొగుడు చచ్చిపోతే వెధవకావటమంటే అది నిజం. కిందటిజన్మలో ఏదో పాపం చేసుకుంటే ఈ జన్మలో మొగుడు పోతాడు. పుణ్యం చేసుకున్నవాళ్లు మొగుడికన్న ముందు పోతారు చక్కగా ! అందుచేత కిందటి జన్మకూడా నిజమే... అబ్బ ! దీనినోరు పడిపోనూ! భగవంతుడు రవణికెంత గొంతు పెట్టాడూ? సుబ్బులు తనని పట్టుకు నలిపేసినట్టు ఎట్లా అరుస్తుందో ! అదంతా భయమా ? నటన ! సంతోషమే...సీను వొట్టి వాజ. కాకపోతే తానే దొంగ అయి రవణివెంట పరిగెత్తడూ ? సుబ్బులుకు దొంగ కావటం అభ్యంతరంలేదు. ఏడిచినట్టుంది వీళ్ళ ఆట ! అబద్దం ఆటా వీళ్ళూనూ...

మొగుడు పోయినవాళ్లు తల లెందుకు గొరిగించుకో వాలో? చిన్నప్పుడు కాకపోయినా పెద్దయినాక తప్పదు. లేకపోతే ఆ లక్ష్మమ్మను గురించినట్టే చెప్పుకుంటారు. లక్ష్మమ్మ ఒక మంచి చీర కట్టదు, కళ్ళకు కాటిక పెట్టదు- ఏమీ చెయ్యదు. పాపం. జుట్టు తీయించలేదు. అందుకని లక్ష్మమ్మను గురించి అసహ్యంగా మాట్లాడతారు. అటు వంటి మాట లనిపించుకోవటం కంటె జుట్టు తీయించుకో టమే హాయబ్బా!

జుట్టు తీయించుకోవటమూ రోతే. మంగలాడి ముందు కూచోవాలి. అత్తయ్య చూడరాదూ! ఛీ! ఛీ!

విధవముండలు తిరిగి పెళ్ళిళ్ళెట్లా చేసుకుంటారో! వాళ్ళకి తప్పు చేస్తున్నట్టుండదు గామాలు? అందరితోనూ మామూలుగా మాట్లాడటానికి వాళ్ళకి బిడియంగా వుండ దేమో? ఆ సరస్వతి చూడరాదూ? సరస్వతిని అందరూ ఎదట సరిగానే చూస్తారు. కాని సరస్వతి చాలా చెడ్డపని చేసిందని అందరికీ తెలుసు. ఆవిడ మొగుడు తనే ఆవిడ మొగుడన్నట్టు ఎట్లా తిరుగుతాడో? ఆవిడకి ఒకప్పు డింకో మొగుడున్నాడని తెలీదూ? ఛీ, ఛీ! కాపరమే చెయ్యాలా ఏం? పుస్తె కట్టినాక మొగుడు మొగుడే!

మొగుడు పోయినదాన్ని పెద్దవాళ్లు నీచంగా చూస్తా

రంటే అట్లా చూడటంచేత కిందటిజన్మలో చేసుకున్న పాపమంతా పోతుంది...

♦ ♦ ♦ ♦

శేషుకు పదమూడో ఏడు. ఆమె మనస్సులో ఉన్న ఈ నమ్మకాలు ఒకరు చెప్పినవికావు. పదమూడేళ్ళపిల్ల హృదయంలోకూడా ఈ లోకంలో ఏదో ఒక విధమైన న్యాయం వుంటుందనే విశ్వాసం వుంటుంది; ఆ విశ్వాసమే లేకపోతే అంత చిన్న హృదయంకూడా గాలికి బుడగ విచ్చినట్టు విచ్చిపోక తప్పదు. లోకంలో వుండదగిన న్యాయం ప్రత్యక్షంగా కనిపించకపోతే అంతలేత హృదయమూ, సాలీడు తనకుతానే గూడు అల్లుకున్నట్టుగా, లోకంలో వుండదగిన ఆ న్యాయాన్ని సృష్టించుకుంటుంది. ఒకటే వ్యత్యాసం: సాలీడు తన గూడులో ఎన్నడూ చిక్కుకోదు. మానవహృదయమూ తన గూడువిడిచి ఒకంతట పైకిరాలేదు.

అకస్మాత్తుగా పిల్లలు ఆట చాలించారు. అరుపులు ఆగినై. శేషు వీధి గుమ్మంకేసి చూసింది. నరసమ్మగారు ఫెళ ఫెళలాడే పట్టుచీర, రంగురంగులది కట్టుకుని మొహాన రూపాయంత కుంకంబొట్టు పెట్టుకొని, గాలిలో ఈదుతున్న దానల్లే లోపలికి వస్తున్నది. ఆమెణ్ణి చూడగానే శేషుకు ఎందుకో నవ్వ బుద్ధయింది. కాని ఆ నవ్వు పైకి రావటానికి ఏమాత్రమూ ప్రయత్నించ లేదు.

"మీ అమ్మేదే శేషూ?" అన్నది నరసమ్మ.

"పురాణం వినటానికి వెళ్ళింది"

"మీ అక్కయ్యో?"

"దొడ్లో తలంటి పోసుకుంటున్నది"

"మా పిల్ల సావిత్రీ గౌరీదేవి వ్రతం చేసుకుంటు న్నది. నేను వచ్చిపోయినానని మీ అమ్మతో చెప్పూ!" అంటూ నరసమ్మ దొడ్డికేసి వెళ్ళింది. "జానకీ" అని ఆవిడ కేకలు పెట్టటం శేషుకు వినిపించింది.

పిల్లలు ఆట చాలించారు. పొద్దూకుతున్నది కూడాను. శేషు వరండాదిగి ఆవరణలోకి వచ్చింది. నరసమ్మ గారు తిరిగివచ్చి వరండాలో గడపకి కుంకంబొట్టు పెడుతూ, "నే నొచ్చానని మీ అమ్మతో చెప్పూ!" అంటూ వెళ్ళి పోయింది.

శేషు నరసమ్మకు సమాధానం చెప్పలేదు. నరస మ్మను చూస్తేనూ, నరసమ్మ కూతుర్ని చూస్తేనూ, సావిత్రీ గౌరీదేవి వ్రతాలు చూస్తేనూ ఒక్కసారిగా శేషుకు మండి పోయింది. ఏ ధ్యానంమీదనో వుండి శేషు తలవాకిలి దగ్గ రికివెళ్ళి దఢాలున తలుపుమూసి గడియ పెట్టింది. కాని మరుక్షణమే గడియతీసి తలుపులుకూడా బార్లా తెరిచింది. "అసలు సంధ్యవేళ ఈ తలుపులు మూసుకోవటమేమిటే?" అని తల్లి వచ్చి కోప్పడుతుంది.

తలుపు తెరుస్తూనే వాకిట్లో ఎవరో ఉండటంచూసి శేషు ఉలిక్కిపడింది. అయితే మరుక్షణం మనిషిని గుర్తించి, "బావా, యిదేనా రావటం?" అన్నది.

బావ — "ఏం శేషూ, కులాసాగా వున్నావా?

కిందటిసారి చూసినప్పటికన్న కాస్త లావయినట్టున్నావే?.... జానకి ఏదీ ?" అంటూ లోపలికి వచ్చాడు.

"అక్కయ్య తలంటి పోసుకుంటున్నది. అమ్మ పురాణం వినబోయింది. నేను నిజంగా పొడుగెదిగానా ?" అన్నది శేషు.

బావ నవ్వుతూ - "పొడుగెదగలేదు గాని కాస్త లావయినట్టు అవుపిస్తున్నావు" అన్నాడు.

"నే నేం లావు కాలేదు" అన్నది శేషు. లావు కావటం చాలా తప్పయినట్టు.

"రోజూ నీ వాళ్ళు నువ్వు చూసుకుంటుంటే తెలీదు. నా మాదిరిగా ఎప్పుడైనా ఒకసారి చూసే వాళ్ళకి తెలుస్తుంది" అన్నాడు బావ.

శేషు మాట్లాడలేదు. బావ అనకూడని మాట ఏదో అన్నట్టుగా తోచింది శేషుకు.

బావా, శేషూ కలిసి ఇంటో ప్రవేశించారు. ఇంటో అప్పుడే చీకటిగా వుంది.

యింకా దీపం పెట్టలేదా అని బావ అడుగుదామనుకుంటుంటేగా శేషు అతని పక్కనుంచి గబ గబా వెనక నుంచి ఎవరో తరిమినట్లు పారిపోయింది లోపలికి. బావ సావిట్లోనే ఆగిపోయినాడు.

ఒక నిమిషంపాటు దీపంజాడగాని, శేషు అలికిడిగాని లేకపోవటంచూసి అతను "శేషూ !" అని పిలిచాడు. శేషు

వంటఇంటివేపునుంచి, "నిప్పెట్టె కనపడిచావదేం?" అనటం అస్పష్టంగా వినిపించింది.

"నిప్పెట్టెకోసం వెతుకుతున్నావా? నా దగ్గిర వుంది పట్టుకెళ్ళు" అన్నాడు బావ.

కాసేపటికి వంటింటివేపు గడప దగ్గిర శేషు ఆకారం అస్పష్టంగా కనబడింది. "ఇట్లా పడెయ్యి" అన్నది శేషు! తన కర్థంగాని ఆజ్ఞలను పాటిస్తున్న యుద్ధసైనికుడల్లే బావ చేతిలో వున్న నిప్పుపెట్టె ఆమెవేపు విసిరివేశాడు. గలగలా చప్పుడుచేస్తూ నిప్పుపెట్టె మండిగానికి కొట్టుకుని కింద పడింది. నిప్పుపెట్టె తీసుకుని శేషు ఆకారం అదృశ్య మయింది.

బావ దొడ్డివాకిలికేసి నడవసాగాడు. అటునుంచి లోపలికి వస్తూ జానకి "ఇంకా దీపం పెట్టలేదుటే?... ఎవరూ?" అన్నది భర్తను గుర్తించక.

"ఎవరా?" అన్నాడు బావ.

"మీరా? ఎప్పుడొచ్చారూ? చీకటిపడ్డా శేషు దీపం పెట్టలేదేమో?

"పెడుతున్నది. తలంటి పోసుకుంటున్నావా? నే నొస్తానని?" అన్నాడు బావ అకస్మాత్తుగా మరోమనిషి అయిపోయి. అతనిలాటి భార్యాప్రియుడు రెండు నెల్లయిన తరవాత భార్యను చూడగానే కొన్ని వెకిలిమాటలు మాట్లాడతాడని మనం సులభంగా ఊహించుకోవచ్చు—

* * *

నాన్నా, బావతోపాటు జానకికూడా భోంచేసింది. "నువ్వుకూడా కూచోవే" అని తల్లి అంటే శేషు కూచోలేదు. శేషుకు జానకిని చూస్తే నవ్వొచ్చింది. కాని ఆనవ్వు పైకి రావటానికి ప్రయత్నించలేదు. జానకి ముస్తాబయింది. తెల్లటిచీర కట్టింది. కళ్ళకి నాజూకుగా కాటిక పెట్టింది. రోజూ మోస్తరుగా లప్పెను పట్టించలేదు. మల్లుజాకెట్టు తొడుక్కుంది. ఈ నగార్పంతా ఒక లెఖ్ఖలోదికాదు. జానకి మొహమే మార్చేసింది. మొహంమీద రోజూ కనపడే కొంత చిరాకూ, చీదరా దాచి పెట్టెలో పెట్టేసింది. మొహంతోపాటు గొంతుకూడా మార్చేసింది జానకి. జానకి ఇంట్లో మనిషల్లే కనిపించటానికి ప్రయత్నిస్తున్న దొంగల్లే కనిపించింది శేషు బుద్ధికి. జానకిని చూస్తే శేషుకి చంప బుద్ధయింది.

బావా, జానకీ భోజనాలయినాక జానకి తన కంచమూ తన మొగుడి విస్తరీ ఎత్తబోయినట్టు నటించింది.

"ఎందుకమ్మా, నేను ఎత్తుతాలే. నువ్వు వెళ్ళు" అన్నది తల్లి. ఆవిడ అట్లా అంటుందని తెలిసినట్టుగానే జానకి చివాలున లేచి వెళ్ళి చెయ్యి కడుక్కుని గదిలోకి వెళ్ళి పోయింది.

"రేపటినుంచీ జానకి మామూలు మనిషల్లేనే ఉంటుంది. మాతోపాటు అన్నం తింటుంది. మామూలు మొహం పెడుతుంది. మామూలు గొంతుతో మాట్లాడుతుంది... దొంగ! దొంగ! అప్పుడే గదిలో దూరింది! ఇంకా అంతా

అన్నాలు తినకుండానే, ఎవరూ పడుకోకుండానే ! ఛీ ఛీ!" అనుకున్నది శేషు...

"నాన్నా, నువ్వు వసారాలో పడుకుంటావా, సావిట్లోనా ?" అని అడిగింది శేషు.

"వసారాలోనే పడుకుంటానమ్మా !" అన్నాడు నాన్న.

"నేను కూడా వసారాలో వేసుకోనా ?" అన్నది శేషు.

"వేసుకో !" అన్నాడు నాన్న. ఎప్పుడూ తన పక్క విషయం సలహా అడగని శేషు ఇవాళ అడగటం ఆయన కర్థంకాలేదు.

నడుము వాల్చటం వ్యవధానంగా శేషుకు నిద్రపట్టి పోయింది. పదిగంటల బండికి అన్నా వదినా వచ్చేసరికి శేషు గాఢనిద్రలో వుంది. నాన్నా, అన్నయ్యా మాట్లాడుకోవటమూ, తల్లి లేచి మళ్ళీ వంట చెయ్యటమూ, వదినె తన పక్కలోనే పడుకుని తెల్లవార్లూ నిద్రపోవటమూ శేషు ఎరగనే ఎరగదు.

తెల్లవారుఝామున అందరికన్నా ముందు నిద్రలేచిన శేషు తన పక్కలో మరోమనిషి వుండటం చూసి గాభరాపడి, ఆశ్చర్యపడి, అర్థంచేసుకున్నాక కలిగిన ఆనందానికి మేరలేదు. శేషుకు తన వదినెను చూస్తే కలిగిన ఆనందంలాటిది కలిగి ఎన్నో నెలలు అయినట్టుంది.

"వొదినా, వొదినా!" అంటూ శేషు వొదినెను ఊపి నిద్రలేపింది. కళ్ళమీద కూర్చున్న నిద్ర బరువుకు రెప్పలు బలవంతాన ఎత్తి వొదినె శేషును చూసి మళ్ళీ కళ్ళు మూసేసి చిరునవ్వు నవ్వుతూ "రాత్రి పడుకునేటప్పటికి చాలా పొద్దుపోయింది, శేషూ, మేం రావటం నీకు తెలీదుగా ?" అన్నది.

తన వొదినె అంత అందమైన మనిషి ప్రపంచంలో లేదనిపించింది శేషుకి. వొదినె దగ్గిర దొంగవేషాలు లేవు. వొదినె ఎప్పుడూ తన విషయమే ఆలోచించదు. ఆ తేడా ఎక్కడుందంటే చెప్పటం పదమూడేళ్ళ పిల్లకి సాధ్యంకాదు గాని తేడా వుందని చంటిపిల్లకూడా ఎట్లాగో తెలుస్తుంది.

* * *

అమ్మ వొదినెను తలంటుకోమంది. శేషుకూడా అడిగింది.

"నువ్వంటుకుంటే నేనూ అంటుకుంటా" అన్నది వొదినె శేషుతో.

"బాగావుంది. నాకిప్పుడు తలంటే తక్కువయిందా యేం ?" అన్నది శేషు. కాని వొదినెతోపాటు తానుకూడా తలంటి పోసుకుంది. తలంట్లు కాగానే వొదినె వాళ్ళ చుట్టాలింటికి బయలుదేరుతూ "నువుకూడా రా శేషూ, లేకపోతే మా చిన్నమామ్మ నన్ను భోంచెయ్యమని చంపుతుంది." అన్నది.

ఇద్దరూ కలిసి వదిన చిన్నమామ్మగారింటికి వెళ్లారు.

చిన్నమామ్మగారి రెండో అల్లుడు కాబోలు శేషుని చూసి "పాపం, ఈ పిల్లకే గదూ ఈ మధ్యా..." అన్నాడు.

"అవును. ఈ మధ్యేం? అప్పుడే రెండేళ్ళు పూర్తి కావస్తున్నది" అన్నది వదిన.

"ఇంకా మళ్ళీ పెళ్ళి చెయ్యలేదేం? చెయ్యకపోయినారా? ఎన్నేళ్ళు?" అన్నాడాయన. చూడటానికి తారు సిద్దెల్లే వున్నాడుగాని ఆయన్ని చూస్తే శేషు కెందుచేతో అసహ్యం వెయ్యలేదు.

"ఎక్కడికి? ఇంకా పదమూడైనా వెళ్ళలేదు వచ్చేయేటినుంచీ అమ్మాయిగారికి సంబంధాలు చూడాలి" అన్నది వదిన శేషు మెడ గట్టిగా చేత్తో అదుముతూ.

అకస్మాత్తుగా శేషుకు వాళ్ళంతా డొల్లఅయిపోయి శరీరం గాలిలో తేలిపోబోతున్నట్టయింది. సమీపంలో ఎక్కడో లాటు ఆడుతున్న పిల్లల్లో ఎవరో "ఔట్!" అని కేకవేశారు. శేషు విరగబడి నవ్వసాగింది.

వదిన శేషుకేసి ఆశ్చర్యంగా చూసింది. ఆవిడకు శేషు నవ్వు అసహజంగానూ బాధాకరంగానూ కనిపించింది.

"ఏమిటమ్మా, శేషూ?" అన్నది వదిన.

శేషు నవ్వు సంబాళించుకుని కళ్ళు తుడుచుకోసాగింది. శేషు మొహం యిప్పుడు ఏడుపు చాలించినట్టున్నది గాని నవ్వు చాలించినట్టు లేదు.

"ఎవరో పిల్లలు ఆటాడుతున్నారు" అన్నది శేషు. ఆ మాటకూడా సరిగా ఎవరికీ అర్థంకాలేదు. ఎందుకంటే ఆమాట పూర్తి చేసేలోపుగా శేషుకు పెద్ద ఎక్కువచ్చి, ఆమె శరీరం తుపానుకు కదిలే రేకుల పాకాలాగా చలించి పోయింది.







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B103 |
| పుస్తకం పేరు | దేవుడిచ్చిన వరం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 167 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | VedaVathi. |
| పేజీలు విడదీసినది | Vedavathi. |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూపినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD. |